శ్రీ

# ప్రమద్వర

[ ఏడంకముల కల్పిత నాటకము. ]

కర్త

చిట్ట్రప్రగడ కామేశ్వర రావు

మొదటి కూర్పు

రాజమహేంద్రవరము

ఆంధ్ర సారస్వత నికేతనమువారిచే ప్రకటింపఁబడినది.

1917

# కృతి సమర్పణము



సాంఘికహితోపదేశకుడును, దక్షిణహస్తమునై, మన్నించి

కాపాడు శాంతమూర్తి, పుణ్యపురుషాగ్రణి, దయా

నిధి, సత్యనారాయణాంకునకు, నా ద్వితీయ

సోదరునకు, కృతజ్ఞతాపూర్వకముగా,

మనోవాంఛిత ఖ్వాడేర, నీతరు

ణా కమలిమును నర్పించు

చున్నాను.



## ఇందువచ్చు పాత్రలు.

### పురుషులు

విజయసేనుఁడు.——కథానాయకుఁడు.

పురీంద్రసేనుఁడు.—ఒక సామంతరాజు కథానాయికతండ్రి

సుసేనుఁడు.—పురీంద్రసేనుని కుమారుఁడు.

హేమపాలుఁడు—ఒక క్షత్రియుఁడు.

పుళిందుఁడు.—కిరాతరాజు.

కళింగుఁడు.—పుళిందుని తమ్ముఁడు.

దుర్జయుఁడు.—పుళిందుని ముఖ్యసేవకుఁడు.

సుజయుఁడు.—కారాగృహాధికారి.

సుమిత్రుఁడు.—పురీంద్రసేనుని ముఖ్యసేవకుఁడు.

సుమంతుఁడు.—సంగీతగురువు.

వజ్రపాణి—హేమపాలుని యాంతరంగిక సేవకుఁడు.

న్యాయాధికారి—కాశ్మీరాధిపుని చేఁ బంపఁబడినవాఁడు.

### స్త్రీలు.

ప్రమద్వర.—కథానాయిక.

రోహిణి.—చెలికత్తె.

సునంద.—ఒకముసలిది.

(సందర్భానుసారము మఱికొందఱు వచ్చెదరు.)

# ప్రమద్వర

## ప్రథమాంకము



నాంది

వెలుఁగుచు సంతసంబు పృథివీవలయంబున నిర్మలాత్ములై
సలలిత మాధురీగరిమ సారెకు జిప్పిలి జీవకోటులన్
గలుపుచు, బంధనంబులను గల్పనసేయుచు మోదవర్తియై
జెలఁగెడు ప్రేమదేవి నివసించుత సభ్యులమానసంబులన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సభామండప మలంకరించు సరసాగ్రేసరులారా! నా భాగ్యకారణమున మీరెల్లరు నుత్సాహభరితాత్ములై నాటకవీక్షాకాంక్ష నేతెంచినారలు. హృదయరంజకమగు నాటకాభినయమునకుఁ గడంగవలయునని యత్నమొనర్చి విదుషీరత్నము నటీసహాయములేమి యాందోళనమొందవలసివచ్చె. ఆమెను బిలిచి కర్తవ్యమూహింతును. —

(తెరవంక దెరిగి)

మనోహరీ! నటీ!

(నేపథ్యమున)

ఆర్యపుత్రా! వచ్చుచున్నాను.

సూ — (దృష్టిసారించి) ఆహా!

తే॥ గీ॥ పంచబాణుని గోనయంబు వలెనిడుపగు
వేణిఁజీరాడ, పయ్యెద వివిధగతుల
గేలసవరించుకొనుచు శంపాలతగతి
వచ్చుచున్నది కన్నుల పండువడుగో!

(నటి ప్రవేశించుచు)

పంచచామరవృత్తము.

మనోహరాంగ! శ్రీకుమార! మామకీనరత్నమా!
మనోగతంబుఁ దెల్పినాఁడ మానసంబుఁదన్పవే!

(ప్రణమిల్లి) నాథా!

తే॥ గీ॥ పురుషునకు నర్థదేహంబుఁ గరితగాన
నేఁడు మీ మనోగతమున నిలచి, కలఁచు
సంశయము నెఱుంగఁ బలికి సకియ ముద్దుఁ
దీర్పఁ బ్రార్థింతు ప్రణయంబు తేటపడఁగ

సూ—మనోజలక్ష్మి! సొంపుగుల్కు మందహాసబంధురం
బునీముఖంబుఁ గన్గొనంగ మోదమబ్బు సుందరీ!

ప్రేయసీ! ఈసభ్యుల నలరింపఁజేయఁగలుగు నాటకాభినయము నకుఁ గడంగవలయునని నిశ్చయించి, యేకథరసోదంచితమై యుండు నాయని యోజించి, భావింపఁజాలనైతిని.

నటి—ప్రియా! మొన్నసాయంకాలము గాలిమేడమీఁద నా ప్రియచెలి మధురిక గ్రంథంబొండుచదువుచుండెను. నేదానిండగ్గరి, "చెలీ! ఆపుస్తకమేమే!" యనియడిగితిని. సంతోషము సూచించుచు నామె, "చెలీ! ఎఱుఁగవా! ఇది, ఆంధ్రసారస్వతనికేతనమువారిచే నూతనముగాఁ బ్రకటింపఁబడిన ప్రమద్వరయను దృశ్యప్రబంధము. గంగావంశమను

పూర్వధరణీధర శృంగమున నుజ్జ్వలకాంతులు జిమ్ము విభాకరుఁడు, కృపామయ మహీవల్లభుని రాజధాని, బృహత్కీమిడి గ్రంథకర్త జన్మస్థానము. ఆతఁడు చిత్రాపూరివంశ మహార్ణవసుధాధామాయితుఁడగు సర్వేశ్వరభట్టునకు పౌత్రుఁడు. సత్యవాక్య భవాఖ్యుఁడగు కామేశ్వరుని ప్రియకుమారుఁడు. కామేశ్వరాభిధేయుఁడు. ఆతఁడు కల్పనాచమత్కృతి విడంబింప నీనాటకమును రచించెను. చెలీ! నీవుకూడ దీనినొక్కసారి చదువుము.” అని పలికెను. ఆర్యపుత్రా! ఆనాటకమును నేను కడముట్ట చదివితిని. దానిని ప్రదర్శించిన మీ యభిమతమీడేరునని తలంతును.

సూ—సఖీ! తన్నాటకాంతర్గత కథ పురాణప్రసిద్ధమా? లేక ఇతిహాస విలసితమా?

న—ప్రియా! ఈకథ పురాణములందుఁ గానఁబడదు. ఇతిహాసము లవమైనఁ బొడమదు. కేవల కల్పనాత్మకము.

సూ—అట్లయిన నీతిబోధకము కాదేమో?

న—ప్రియా! నాటకములు నీతులుగఱపఁ గంగణమును దాల్పవు. సదయులగు సభికులు కూడ నీతులు నేర్చుకొనుటకే నాటకమునకు రారు. నాటకముల ముఖ్యోద్దేశము ప్రమోద మొసంగుట. హరిశ్చంద్ర నాటకముఁజూచి సత్యముపలుక నేర్చుకొనవలెనంచువా రెవ్వరుందురు? విశ్వామిత్ర వసిష్ఠుల వాక్కలహమును విని నువ్వులుమూరువారు కొందఱు. చంద్రమతి హరిశ్చంద్రుల దుర్దశనుఁ గన్నీరుఁ గార్చువారు కొందఱు నక్షత్రకుని నిష్ఠుర మనోగతమునకు గోపమును, జాలియును, బూనువారుగొందఱు. తుదకుమాత్రమందఱును నాటకశాలనుండి పైకేగుచుండునపుడు ప్రమోదభరితులగుదురు. చూపరులు నీతి గ్రహించువారుకొందరుండవచ్చును; గాని నీతి గఱపుటే నాటకముల ముఖ్యోద్దేశము గాదు. ప్రమద్వరనువ్రాయునపుడు గ్రంథకర్త రసగ్రహణ ధురీణుల

గు సభికులమనోరంజకకారణమగు కథనుకల్పించెను. ప్రియా! సకల
దేశీయుల నాటకవాఙ్మయము వాంఛింపనదింతియు. అదియాదేరనేని
తనశేఖినియదృష్టవతియని కవిసంతసించును.

సూ—ప్రేయసీ! అట్లయిన, ఆనాటకమునే యాడుదము. ఇప్పుడు చాల
వేళయైనది. పూర్వదిక్సతి వినోదార్థమెగరవేసిన పారావతమువలె
చంద్రుఁడు మెఱుఁగెక్కి మిన్ను నలంకరించుచున్నాఁడు. పాత్రలుసిద్ధ
ము పడవలయును. రమ్ము. పోవుదము. (నిష్క్రమింతురు.)

విష్కంభము.

## ప్రథమరంగము

ప్రదేశము. ముల్తానునగరమునందొక సౌధము.

(ప్రవేశము. పురీంద్రసేనుఁడు విచారగ్రస్తుఁడై.)

కటకటా! దినములొకతీరున జరుగనేరవు; కాలచక్రమొకతీరున్న
తిరుఁగునని తలఁచుట వెఱ్ఱి.

ఆ॥ వె॥ నిలువనీడలేని నిరుపేదవారల
సింహపీఠమందుఁ జేర్చి, పిదప
నిబిడవన్యసీమ నిడుమలఁబెట్టెదు
కాలమా! యెఱుంగఁగలమె నిన్ను!

ఔను! నాయెఱింగినంతదనుక నేనాతనియెడ ద్రోహమెట్టిదియుఁ
జేసియుండలేదు. అట్లయినను, నాయందాతని కాగ్రహము గలిగినది.

సీ॥ హృదయంబుసాక్షిగా సంచివరించిన
సతిఁబాసియువతి నెవ్వతె నెఱుంగ

ఘోస్వార్థమెపలు కాడినయర్థంబుఁ
దత్రీతోఁ నన్నోనరింపఁ దప్పియెఱుఁగ
ప్రజలకేరికినైనఁ బాములుగల్పించి
దుఃఖానలంబునఁ ద్రోసియెఱుఁగ
శరణన్నశాత్రవుఁ గరమనురక్తితోఁ
గనకకాఠిన్యతఁ గొంచియెఱుఁగ
తే॥ గీ॥ విమలదేశాభిమానంబు విడచుటెఱుఁగ
రాజభక్తిఁ బోనాడి, దురంతములకు
వసతిమానసగృహమువం దొసఁగియెఱుఁగ.
నకట! యీగతికిఁ గతమే మగునో చెపుమ?

రెండుదినములలో జన్మభూమి విడువవలయును! తీవ్రమగు రాజాజ్ఞ మీరితినా, ప్రాణములు దక్కవు. హా! మల్లాను రాజ్యలక్ష్మీ! నిన్నుఁ బాసి నేనెట్లు సుఖింప నేర్తును?

చం॥ చినతనమాదిగా నెడము సేయక, లేశము జింత లేక, నె
మ్మనమున నీయనన్యకృప మాటికిమాటికి సంస్మరించి సం
జనితముదావహంబునఁ బ్రశాంతమతిన్ జరియించినాను నే
డనయము ద్రోఁచె, నేవిధమ వ్యాకులపాటు హరించునక్కటా!

హా! హతవిధీ! సముద్రుఁడు గర్భస్థిత రత్నసముదయంబుల కత్యంతానందమొంది యుప్పొంగురీతి నా సంతానమును గాంచి మురియుచుంటిని. సంపదలకుఁ గొఱంతయెఱుంగనైతిని; విశదంబగు యశంబు నార్జించితిని. ఎవ్విధిఁ దలపోసిచూడ నేనదృష్టవంతుఁడనని దృఢముగా నమ్మికొంటిని. నన్నెఱింగినవారెల్ల రట్లే తలంచిరి. నేఁటికి నీ యనుగ్రహమువలన

నిట్టినిర్భరనిర్దశ సంప్రాప్తించెను. హా!—

తే॥ గీ॥ నిర్మలయశో సుధాంబుధి యూర్మిడోలి
కలసీరంతర మూగాడు ఘనతఁ బాసి
దుర్యశోవీచి కలనెట్లు దుఃఖపడుచు
నుండువాఁడను; గతియేమి యోయిలింగ!

నాయెడలోప మెట్టిదియును గలిగియుండలేదని యధికార ముద్రవహించిన యుత్తమోత్తము లెందఱో యాతనితోఁ జెప్పిరి; గాని కార్యముతేదాయె. ఔను, రాజులకు నిజానిజములతోఁ బనియేమి? ఆశ్రితులమాటలు వేదతుల్యములు.

ఆ॥ వె॥ తన్ను నాశ్రయించి ధర్మమార్గము బాసి
పలుకువానినమ్మ నిలధవుండు;
ప్రక్కనున్న ముండ్ల మొక్కపైఁ బ్రాకదే
లతసతంబు వక్రగతలు బూని?

అయ్యో! వీఱిడినై రాజోత్తముఁడగు సురపాలుని దూషింప నేమిటికి? నాయదృష్టమిట్లుండ నెవ్వ రేమిచేయుదురు? జన్మస్థానవియోగదుఃఖ మనుభవింప వ్రాసియుండఁ దప్పునా? అనుభవించితీరవలయును.— నా గతియెట్లయినను విచారింపను.

చ॥ సిరిగలయింటఁ బుట్టి గుణసింధుల చెల్మి గ్రహించిమించి సం
బరమునఁ గాలయాపనము మానుగఁ జేసితి, కీడుబొందినన్
బొరయదుదుఃఖమించుకయుఁ బూతచరిత్రులు పుత్రులున్గుణో
త్తరసుతయున్ విదేశములదావెటులుందురటంచుఁ గుందెదన్
ఆ॥ వె॥ హిమమురీచితనదు కమనీయతనువల్లి

నోఁ కేనేని యోర్వ లేక, నున్న
రనెడు బాల యిడుములను దేలి యేరీతి
గట్టుఁ జేరి బ్రతుకఁ గలుగునకట?

ఉత్తరక్షణమున నేమి వచ్చునో యెఱుఁగఁ జాలము. హా! ధీవిశాలా! సురపాలా!

శా॥ క్రూరాత్ముండు కళింగరాజు మనపైఁ గోపించి సైన్యంబుతో
వీరాలాపములాడుచున్ నడచిదోర్వీర్యంబుఁ జూపంగనౌఁ
డేరీతన్ వధియించివానిని ముదం బేపారఁ వర్తించితిన్;
గారాబంబునఁ జూడవేయుపుడు; నా కర్మంబు దూషించెదన్

( సేవకుఁడు ప్రవేశించి )

దేవా! హేమపాలుఁడు తమదర్శనాపేక్ష వేచియున్నవాఁడు. మొదలయాగు నేని తోడ్తెచ్చెదను.

పు. సే.—ఏమీ! కళ్యాణిపురాధీశ్వరుఁడు హేమపాలుఁడా? ( ఆలోచించి ) ఆహా! నా భాగ్యమేమందును? ఆతని సమక్షమునకు దారిసూపుము.

( సేవకుఁడు ముందు నడువ, హేమపాలుని సమీపించును. )

హేమపాలకుమారా! స్వాగతము.

తే॥ గీ॥ కుశలమా మీకు దిగ్దంత విశదకీర్తి?
క్షేమమా మీకు విద్వేష సింధురహరి?
ఆయురారోగ్యమా మీకు నవనినాథ?
కలిగె తులలేని మీరాక కలిమిమాకు!

హే. పా.—ఆరోగ్యత్తమా! నిర్భాగ్యుఁడనగు నాకు కుశలము గాకేమి? మీరు వినియేయుందురు.

చ॥ అతులితసత్ప్రతాపమహిమాఢ్యుఁడు, సద్గుణశేఖరుండు, సం

# ప్రమద్వర

తతవిజయుండు మన్మథుఁడు ధన్యుఁడు మాతొలిజన్ముఁడక్కటా!
పతితులచేవధింపఁబడి భంగము నొందుటనెన్ను నప్పుడా
తతము విషాదమయ్యెడు, నుదారచరిత్ర! భరింపశక్యమే?

హా! ఆవరగుణాభరణమూర్తిని, యశఃశుభ్రకీర్తిని; దయాప్రపూర్తినిఁ దలంచినఁ, గొనియాడినఁ, దనివితీరునా?

పు. సే.— రాకుమారా! గతము ద్రవ్వ నేమి కారణము? విచారింపకుము. గతించినవారు మనవారు కారు. ఆతని యప్రతిమాన ప్రతాపంబు, నతులసుగుణసంపత్తి నెఱుంగనివా రెవ్వరుగలరు? అతఁడు మనలనుఁ బాసి మర్త్యలోకమంతయు బంధురవిచారవంతము గాఁ జేసినాఁడు. తనువులు శాశ్వతములు గావని దృఢమనస్కులమై శాంతి వహింపవలయును.

హే. పా.— ఆర్యా! మీమాట సత్యము; కాని,

చ॥ చటులపరాక్రమంబున రసాతలమంటఁగ వైరివీరులన్
జటుకనఁ జేయువాఁడమర సంస్తుతవర్తనుఁ డేగమొండినై
పటుతర దేహలోభమునఁ బ్రాణములన్ విడనాడకీగతిన్
గటకట! యున్నవాఁడ; తొలికర్మము లెట్టివిచేసినాఁడనో?

పు. సే.— అవును. మీయన్న సత్యపాలుఁడు సార్థకాభిధేయుఁడు. ఆతనికో తఁడే సాటి. సత్యపాలుని సఖియు సుమిత్ర సుచరిత్ర. విశేషించి సువివేకనిలయ. పాపము, దురాత్ము లెవ్వరో యా దంపతులను నిష్కరుణాత్ములై వధించిరి. ఇంతకు,

తే॥ గీ॥ వనిధివలయితధారుణీ వరులుగాని,
చేరుటకుఁ, దినుటకు, లేని వారుగాని
చనుమునతేనట్టిదీపము సరణి నంత

రింతురు భయదమరణజిహ్వాంతరమున!
విచారించిన లాభము లేదు. ఎందఱెందఱు నృపోత్తము లుద్భవింపలేదు? ఎన్నెన్ని మహాత్కార్యము లాచరింపలేదు? వారలెద్ద రిప్పుడేరీ? మృత్యుదేవత వారియెడ జాలిఁగొనియెనా? అందఱు నామెకు సమానులేసుమా? హేమపాలా! మేడమీదికరుగుదము రమ్ము.

( సౌధోపరిభాగమునకుఁ బోవుదురు )

హే. పా — ఆర్యా! నేనిట కరుదెంచునప్పుడు మీచరితంబాలించి యయ్యంటిని సత్యాసత్యము లెఱుంగునంతదనుక నా చిత్తం బుత్తలపాటందుచున్నయది.

పు. సే — కుమారా! ఆయాసనమధిష్ఠింపుము. సర్వము నీకు నివేదించెదను. ( హేమపాలుఁడు కుర్చీలోఁ గూర్చుండును. ) ఎఱుఁగుదువుకదా, ముల్తానువిభుని సురపాలుని, అతఁడు సుగుణాలవాలుఁడయ్యు, నార్తజనావనుఁడయ్యుఁ, బ్రజానురంజకుఁడయ్యు, నాగురదృష్టకారణమున నిరోక్షించినగు నాపై నాగ్రహముఁ గొని యీనగరమును వీడుకొలుపవలయునని యుత్తరువు జేసినాఁడు. అతని యాజ్ఞ యనుల్లంఘనీయము. ఎల్లి నేనీరాజ్యమును బాయకుందునేని, సురపాలక్ష్మాపాలుని యాగ్రహాగ్నికి నింధనము గావలసివచ్చును. కాశ్మీరంబు సుభిక్షంబని వినికి. అందువాసంబు నాకభిమతంబు. అచటి ప్రకృతి సౌందర్యావలోకనమున సంతాపనీరదములు హరించును. మామకీనమనోతలమును పట్టముగాఁ గప్పియున్న దుఃఖాంధకార మాకాశ్మీరరాజవదన బాపునని నమ్మకమున్నది.

హే. పా — అయ్యో! మీకెంత కష్టము వచ్చినది. సురపాలుఁడు సురపాలుఁడనియే వాడుక. మీరు సద్గుణమూర్తులరు. మీయందాతని కాగ్రహకారణమగోచరము. శాంతమూర్తులకుఁ గోపము రానేరాదు; వచ్చునేని, యెదిరివారల నాశనము సేయక మానదు. అతఁడు విధించిన బుల

మీరీనగరమున సకాలమునవిడమట శ్రేయంబు. ముందుముందు నిజా నిజములు బయలుపడును. ఈనగరమున మాగృహమున్నయది. అది యొక విశాలమైన భవనము. అందుమీరు వాసంబు సేయవచ్చును. నే నిప్పుడు కార్యాంతరమున ముల్తానులో రెండు నెలలుండవలసియున్న యది. సమయమునకు వేని సురపాల ధరణీశుని దర్శించి, మీయందాతని కాగ్రహ కారణంబరయువాఁడ. నాసేవకుఁడను వజ్రపాణిస్వామిభ క్తికిఁ బెట్టినదిపేరు. వానినిమీ వెంట నంపెదను. మిమ్ములనువాఁడా గృహమునఁ బ్రవేశ పెట్టును.

ప్ర. సే—ఆహా! మీకు మాదెసఁగల కూర్మి నిరుపమానము.

ఖండ స్రగ్విణి.

సోమపాలా! దయా
సీమ!నీ సద్గుణ
స్తోమముల్ చేర్కొ-నన్
లేము సుం తేనియున్.

సో. పా—మీరు పోయెదరు; గాని, మాగృహమున దయ్యములు గలవని మిమ్ము పెక్కండ్రు జడిపింతురు. మీరుమాత్రమిట్టి పిచ్చి యనుమానములకు లోబడవలదు. మీపిల్లలకీవిషయమై చెప్పవలదు. చిన్నవారగుటవలనవారు భయపడియెదరు సుండీ!

ప్ర. సే—నాకుమారుఁడు సునసేనుఁడు సమదవైరి వీరభయంకరుఁడు. అతఁ డిట్టి మాటలాలించిన హాస్యము సేయును. విజయసేనుఁడు బలవద్రిపు గర్వతమోపహారి. ఉదయమార్తాండ ప్రచండుఁడు. అతఁడెన్నఁడిట్టి పిచ్చియనుమానములఁ బూనఁడు. నాకుమారిత ప్రమద్వర గుణరత్న నిధి. మీరామెనుగూర్చి వినియేయుందురు.

సో. పా—ఆర్యా! ప్రమద్వర జగతీజనంబుల జిహ్వారంగస్థలి నాట్యమా

దు మన్నియది. ఆమెను జూడవలయునని నేనెన్నియోమార్లు అభిలషిం చితిని; గాని నాయభిలాష తీరలేదు. (మెల్లగా) నేఁడామెను జూడనెంచి, యేనిటకరుదెంచితిని. మీరంగీకరింతురేని యామె నర్ధాంగిగా వడయుటకు సన్నద్ధుఁడను. మీబాంధవ్యము నేవాంఛించుట నిష్ప్రయోజనముగా నుండునని తలంచెదను. తలంచుటే కాదు; దృఢముగా నమ్మెదను.

పు. సే—ఆహా! నేఁడెట్టి సుదినము! నా మనోద్యానము కాంతిమంతమైనది; అయినను హేమపాలా! తొందరపడి వివాహకార్యములు సేయరాదు. నిలకడవహింపవలయును.— ఆమెను జూతువేని నీమనంబెటులమారునో? (ఎలుగెత్తి) సేవకా!

(సేవకుఁడు ప్రవేశించి)

దేవా! అనుజ్ఞవేఁడెద.

పు. సే—ఓరీ! నీవుపోయి సుసేనవిజయసేనులను, ప్రమద్వరను సత్వరమరమ్మంటివనుము.

సేవకుడు—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

హే. పా—ఆర్యా! ప్రమద్వరకిప్పుడు ప్రాయమెంత? విజయసేనుఁడు మీ తనయుండా?

పు. సే—ఆమెకిప్పుడు పదునారువత్సరములు పూర్తియైనవి. రాకుమారా! విజయసేనుని చరితంబు నాకేమియును దెలియదు. అతని తలిదండ్రులెవ్వరో యెఱుంగుటకుఁ దగిన విషయములు మాకు లభింపవయ్యె. ఆతని గుణగణంబులు వర్ణనాతీతములు. నన్నుఁ ‘అప్పా!’ యని పిలచును. పాపము! వానికేమి తెలియును? నిజమెఱింగినవాఁడనయ్యు నేనాతనిని ‘కుమారా!’ యని పిలచుచుందును.

(సుసేనవిజయసేనులును ప్రమద్వరయును, ప్రవేశింతురు.)

పు. సే.—కుమారా! సుసేనా! రమ్ము. విజయసేనా! భద్రమా? కుమారీ!

ప్రమద్వరా! నీవు శుభంబే? అదిగో, హేమపాల ధరణీకాంతుఁడు. ఆతఁడు మిమ్ములఁజూడ వేడుకపడి యరుదెంచినాఁడు. ఆతని యాశీర్వచనమ్ములఁ బడయుఁడు.

(సు—వి. సే—ప్ర— హే. పాలునకుఁ బ్రణమిల్లుదురు.)

హే. పా—దీర్ఘాయుష్మంతులగుదురుగాక! (ప్రమద్వరనుజూచి, యాత్మగతమున) ఆహా! ఆకళ్యాణి రూపరేఖావిలాసము లేమని కొనియాడుదును! భూలోకమున కవతరించిన మోహినియా?

కం॥ హరిణీనయనకు నెనయే
హరిణీనయనలును లేరు; హరిహయుసతియో?
హరు నర్ధాంగియొ? హరికిన్
హరువగు సిరియో? యెఱుంగ నగునే నాకున్

మానవకాంతకిట్టి సౌందర్యముండ నేర్చునా? ఆహా! త్రిలోకమోహన తనూవిలాసిని యీసుమాంగి!

కం॥ తోలుకారు మెఱుఁగుతోడను
దులఁదూఁగెడు మేనుగలిగి తోయజముఖి, పూ
విలుకాని శరాళికినన్
బలిఁజేసె నికేమి సేతు భరియింతు నెటుల్?

హాయందీమె కెట్టి భావముదయించెడినో? ఔరా!

సీ॥ రోలంబజాలంబు రోఁత సేయఁగఁజాలు
నెఱికొప్పు గన్నుల గఱవుఁదీర్చు
నింమనంబుఁ గళంక మొందఁజేయఁగఁజాలు
వదనంబు జింతలఁ బాఱఁదోలు

వికసితకుముదారవిందంబులనుబోలు
కన్నులానందంబుఁ గలుగఁజేయు
నరుణదీప్తులఁజిమ్ము యధరబింబంబువా
గమృతంబుఁజిలికి వికాశమొసఁగు

తే॥ గీ॥ అహాహా! మానసనీతు నత్యంతముదము
వాసమును జేయునిప్పుడు, వనరుహాక్షి
యేమనునో? పాలముంచునో? యిష్టపడదో?
నీటముంచినఁ బ్రాణము లేటికిలను?

౧. సే—హేమపాలా! ఏమట్లున్నాడవు. నీముఖంబున మారుపొడఁచిన దేమి?

హే. పా—ఆర్యా! తెలియింపుఁడు. ప్రమదాశిరోమణియగు ప్రమద్వరను గాంచినంత ప్రమదాంబుధి మునిఁగిపోతిని. ఆహా!

॥ పలువురు సుందరాంగియని వర్ణనసేయఁగ నాలకించి, సం
కలిత ప్రమోదమూర్తినయి కాలముఁబుచ్చితి గానిమన్మనో
నిలయనునీ ప్రమద్వరను నేఁడుగనుంగొని జన్మమంతయుఁ
ఫలితముజేసినాఁడ, నవ భానుఁడు పద్మినిఁ జూచుకైవడిన్

ధర్మజ్ఞా! పురీంద్రసేనా! నా చెప్పినవిషయము మరల చెప్ప నేల? అందువిషయమై శ్రీ నగరమునకుమగిడి సేనరుచెంచునపుడు. నాకై చేఁగింపఁ బ్రార్థితులు.

(సు—వి. సే—ప్ర—నిష్క్రమింతురు.)

. సే—అటులనే చేసెదను.

॥ ఆనవలాలలలామ తగు నంగననీకుఁ, దలంచిచూడనీ

నానలినాక్షికిఁ దగుసుపన్నివిధంబుల, మీవివాహముం
బూనియొనర్చు నీశుభము పొచ్చముగానితలంపుతో మతిన్
మానసవనాక్షచంద్ర! యనుమానముమానుము, వేయునేటికిన్

ఈవిషయమునుగూర్చి యాలోచింపఁదగిన దేమియును లేదు; గాని ప్రమద్వర మనోగతి మెఱింగినఁగాని నేనేమియును జెప్పఁజాలను. మీరు శ్రీనగరమునకరుగుచున్నపుడు మత్ప్రతికారప్రశ్నమును మీక ర్పించుటనుగూర్చి నిశ్చయ మెఱిఁగింతును.—వజ్రపాణినిఁ బంపువార లుక నాకే

హే. పా—తప్పక ప్రత్తెంచెదను; గాని నామాటాలింపుడు. మాయన్న సత్యపాలుఁడు దారుణమృత్యుముఖంబునఁ బడినవాఁడగుట, నాతనికి కుమారులు లేమి, నేనిప్పుడు కళ్యాణపురాధీశ్వరుఁడనైతిని. నాగూర్చి చెప్పుకొనుట లక్షణముగాదు — నాకడమాట యేమందురా?

ఉ॥ రాజితకీర్తిసాంద్ర! రిపురాజకమోదివనాథ! నామనో
బీజము దుఃఖకీటక మపేతయొనర్చి కృశింపఁజేసె; నం
భోజదళాయతాక్షినగు మోముకతంబున నంకురించు, మీ
రేజతనంబు మానిన నిఁకేమివచింపుడు; మీరెఱుంగరే!

ప్ర. సే—మీరింతగాఁ జెప్పవలయునా? సర్వగతుల మీమనోభీష్టమనుసరింపఁ బ్రయత్నించెదను.

హే. హ—(తొందరపాటభినయించి) అబ్బా! ఎంత వేళ యైనది!

తే॥ గీ॥ భానుఁ డపరాబ్ధియందునఁ బడెను; తార
లొకటితరువాత నొకటిగాఁ బ్రకటితంబు
లాయె; తిమిరేభసింహమై యాకసమున
లలితమూర్తి పొలిచె మృగలాంఛనుండు!

ఆర్యా! నాకు సెలవొసంగుడు. మీతోసంభాషణము కాలపరిమాణ
మెఱుంగనీయదు. నేపోయివచ్చెదను.

(హే.పా. మేడదిగి నిష్క్రమించును. పు.సే. లోనికరుగును.)

---

## ద్వితీయరంగము



(ప్రదేశము. శ్రీనగరమున నొకసౌధరాజము. ప్రవేశము. వజ్రపాణి.)

హేమపాలక్ష్మానాథుని యనుమతివడపున పురీంద్రసేనుని గుట్టుం
గాతంబుగా నీసౌధంబునఁ బ్రవేశపెట్టితిని. వారికెట్టిలోపములును గ
కుండ మెలఁగుచుంటినని నానమ్మిక; వారును దమకెట్టిలోపములును
గనటులనూహింపలేరు. పురీంద్రసేనుని పరిచారకుఁడు, సుమిత్రుఁడు
సదాయోగ్యుఁడు; స్వామికార్యనిర్వాహణదక్షుఁడు. నిన్నరాత్రి నన్నా
దు జేరంజీరి, “వజ్రపాణీ! నీతోఁగొన్నివిషయములు మాటాడవలసి
యున్నది. ఇప్పుడు చాలరాత్రియైనది. రేపునిన్నుఁగలిసికొనియెదను.”
వాక్రుచ్చెను. ఆతఁడు నాతోఁజెప్పనెంచిన విషయమేమై యుండునో
కో? హేమపాలునిఁగూర్చి యాతఁడేమైన వినియుండునా? ఆరహ
ంబెఱుఁగుటకు హరిహరాదులకైన శక్యంబుగాదు! (చూడ్కిసారించి)
వ్వారెవరు? (పరికించిచూచి) ఓహో! సుమిత్రుఁడే! (ఎలుఁగెత్తి)
తమా! నీకైవేచియున్నాఁడను.

(సుమిత్రుఁడు ప్రవేశించును.)

—వజ్రపాణీ! నీకైవెదకుచుంటిని; అందువలనాలస్యమైనది. పా
పము! నాకైవేచి నీవెంతవిసిగితివో! నీవుశ్రమగలిగించి నందులకు న
న్ను మన్నింపుము.

పా—సుమిత్రా! ఇందుమన్నించుటకేమున్నది? నాతోమాటాడవలసి

యున్నదని నిన్నరాత్రి పలికితివి. సదుత్తరమొసంగఁ గలుగువాఁడ
నేని ధన్యాత్ముఁడను.

సు — మిత్రమా! ఈ సౌధమునఁ బ్రవేశించి వారము దినములైనది. ఇట
కరుదెంచునపుడెందఱో మస్మోహర్మ్యమునఁ జేరవలదని వారింపఁ
జూచిరి. కారణమరయనిందు దయ్యములున్నవని జవాబుచెప్పిరి. వా
రిమాటలయందు నేనించుకేనియు విలువయుంచను. చిన్ననాఁటఁగో
లె నీవు హేమపాలునిఁ గొల్చుచున్నవాఁడవు. ఈగృహమునుగూర్చి
నీకంతయుఁ దెలిసియుండవలయును. నీవువచించునది సత్యమని న
మ్మెదను. నాహృదయతలమున గాఢముగ నాటుకొనియున్న యీ
సంశయమును దీర్పఁగలవాఁడవని నమ్మికొంటిని.

వ.పా — చెలికాఁడా! నీవువినినది కేవల మనృతముగా నేరదు. దయ్యము
లున్నవని చెప్పుటను నేనెన్నఁడు నిక్కడే కాదుకదా, మఱియెందు
ననుగూడ జూచియుండలేదు. ఒక్కనాఁటిరాత్రి సత్యపాలుని సకియ
శయనాగారమున నొక నీలాకృతిఁ జూచెనట! అది మెల మెల్లన మ
నుష్యాకారమును బూనెనట. సుమిత్రి భయవివశయై కేకలిడెనట! స
త్యపాలుఁడామెను సమీపించి, యనునయించెనట. ఇంతియ నాకుఁదె
లిసిన విషయము. శయనాగారమున శ్యామలాకృతి గానవచ్చుటేమి?
క్రమక్రమముగా మానవాకృతి వహించుటేమి? దీని యర్థము నాకిం
త దనుక దెలియకున్నయది. సుమిత్రా! నీవిట్టి యనుమానములను మ
నంబునఁ జోటొసంగకుము.

సు — వజ్రపాణీ! సరియే. — హేమపాలుఁడు ముల్తాను నగరమున రెండు
నెలలుండునట, కారణము? మాప్రభువగు పురీంద్రసేనుఁడు నాకుఁజె
ప్పకఁ దానేమియుఁ జేయఁడు. హేమపాలుఁడు గూడ నీయందట్టి న
మ్మకము గలవాఁ డనియనుకొందును.

వ.పా — మిత్రమా! నాకు దెలియని విషయము మాతనికిఁ దెలియదు. స్నేహి

తుఁడవగుట వలనఁ జెప్పుచున్నాను. నిజముగా హేమపాలున కా నగరమునఁ బనియేమియును లేదు. ప్రమద్వరను జూడ వలయునని యాతఁడందుఁబోయి యుండెను. మరియును ప్రమద్వరను నర్ధాంగిగాఁ గైకొన నెంచిన వాఁడగుట, తద్విషయమై ప్రయత్నము లను జేయుచున్నవాఁడు.

—అటులనా? ఆతని యభీష్టమున కంతరాయము గలుగకుండుగాత!

.పా—ఒకసంగతి యడిగెదను. కోపమూనవుకదా? పురీంద్రసేనునితో నిటకరుదెంచిన విజయసేనుఁడాతని బంధు జనుఁడా? లేక యాతని కుమారుఁడా?

—విజయసేనుఁ డాతనికుమారుఁడుగాడు. ఆతనిచరితం బతివిచిత్రంబు. పురీంద్రసేనుని వివాహమహోత్సవమ్ముజరిగి నేఁటి కిరువదివత్సరంబులైనది. వివాహానంతర మొకనాఁ డాతఁడు చావడియందుఁగూర్చుండి, కొంతవడి స్నేహితులతో వినోదగోష్ఠిఁ బుచ్చెను. పిమ్మట వారల వీడ్కొలిపి లోనికరిగెను. మధ్యరాత్రమున నాతనికొక యార్తనాదము వినవచ్చెను. ఆతఁడులికిపడి శయనాగారమును వీడుకొలిపి చావడిలోనికరుదెంచెను. ఆతనికన్నదోయి కొకబాలుఁడగ్గమయ్యెను. ఆశ్చర్యనిమగ్నుఁడై యాచిఱుతప్రాయంపు బాలుని నెత్తుకొనిఁ యాతఁడు మేడమీఁదికరిగి, నన్నుఁ జేరంబిలచి, "సుమిత్రా! ఈబాలుఁడు రూపజితమన్మథుఁడు. వీనియందు నాకనురాగము జనించినది. వీనిని బెంచి, పెద్దవానినిజేయ నాకభిమతముగలదు. నీయభిప్రాయమేమి?" యనియడిగెను. నేనందులకొడంబడితిని. ఆనాఁటఁగోలె నాబాలుని విలువిద్యయందసమానునొనరింప నాతఁడు ప్రయత్నించెను. ఏవిద్యల నేర్పఁగడంగినను, సునాయాసముగ గ్రహించువాఁడగుట, 'విజయసేనా!' యని యాతఁడాతనిం బిలచుచుండును. పురీంద్రసేనుని కుమారుఁడు, సుసేనుఁడు; తనూజాత ప్రమద్వర.

వ. పా — మిత్రమా! నీమాటలువినుకొలంది నాకుత్సాహమధికమగుచున్నది. మఱియొకమాట. దిక్కులేని విజయసేనుని బెంచి, పెద్దవానిగా నొనరించిన్న పురీంద్రసేనుఁడాతనికిఁ దండ్రి సమానుఁడు. ప్రమద్వర యాతనికి సోదరితుల్య. అట్లయ్యు, విజయసేనుఁడా మెనువరింప, —

సు — (అక్రోశత్తిలో) వజ్రపాణీ! నిజానిజములెఱుంగక నీవిట్టిమాటలాడరాదు. విజయసేనుని నీవెఱుంగవు. ఆతఁడు సుగుణరత్నాకరుఁడు. కుముదాప్తునకైనఁ గళంకమున్నది. గాని యాతనియెడ నెట్టితొలుసులును లేవు. ఇవి నేఁజెప్పుమాటలుగావు; లోకమంతయు నెఱిఁగినవిషయము. ఇంతకు హేమపాలునకు నిశ్చయింపఁబడిన కన్య నొండొకఁడు జూడఁగలఁడా?

వ. పా — క్షమింపుము. తెలియకనిన్నడిగితిని. నాసందేహము న్యాయమగునదికాదు. మిత్రమా! మఱలనిన్నుఁ గలిసికొనియెదను. మీయజమానునకేమికావలయునో యెఱుంగవలయును. ఇప్పటికి నాకు సెలవొసంగుము.

సు — నేనుగూడఁబోవలయును. సురసేనకుమారుఁడు మృగయా విహారార్థము సమీపారణ్యభూములకరుగును. అందుకువలయువిధము నాయత్తపరుపవలయును. మఱలకలిసికొందము.

(చెరియొకవైపు నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము



(ప్రదేశము. ఒకయాగారము. ప్రవేశము. విజయసేనుఁడాసనాసీనుఁడై.)

అవును. ఆమెయే నామనోహారి. ఆరమణీమణీ దరహాసకౌముది మన్మనోతలమును విశుభ్రకాంతి మంతమొనరించెడిని. ఆసుగుణాలవాల నామక్షమునసుండునేని భూలోకము స్వర్గధామమగును. అప్పటి యానం

దోత్సాహ సంభ్రమంబులు వర్ణింప నేఁజాలను! ఆహా!

సీ॥ తలిరాకుఁ బోఁడిని గలనైనఁ బాయను
మఱుగయ్యె నేమి సమక్షమందు?
కలకంఠవాణి బల్కాడునెప్పుడు నాతో
మాటాడ దేమి సమక్షమందు?
గానముల ప్రోక సద్గోష్ఠిఁ బాయదునన్ను
మఱచెనా? యేది సమక్షమందు?
నవలావతంసము, నామనోనిలయ, ప్ర
మద్వర లేదు సమక్షమందు!

తే॥ గీ॥ అతివఁ బాసినక్షణము శతాబ్దమగును!
సతినిఁ జూడనియప్పుడు విశాలగగన
తలమునహిమ మయూఖ మండలము లేని
చందమునఁ దోఁచు, నెటుసైచి యుందునకట!

( చెక్కున కరంబూని. )

హా! ప్రేమమా! నీవెంతయపరాధ మొనరించితివి?

చ॥ కనులనుమూసి సౌఖ్యాక్షర గాఢసుషుప్తినిఁ దేలియాడునే
ళనో, కమనీయలక్షణ విలాసిఁ బ్రమద్వరఁ గాంచునప్పుడో?
మనమున నామె సద్గుణ సమాజము వర్ణనసేయు కాలమం
దునో? యెపుడో యెఱుంగను వినోదముగానను గాసిపెట్టితే?

తే॥ గీ॥ కరుణఁ దలపోసి మ్రొక్కింతు గద్దెపైనిఁ
గరుణతోలఁగిన దుర్గమ కాననముల

గ్రమ్మరంగను జేతువు; గూడినిన్ను
మోదమొందిన వారలీ భూమిలేరు

ప్రేమమా! నీచెలికార మంగీకరించితిని. నీవలన సుఖింతు నను నాశ లేశము లేదు. అట్లయ్యు నిన్ను విడువఁ జాల కున్నాడను.

తే॥ గీ॥ కన్నులకు నించుకైనను గానరావు;
అఖిలలోకంబులందుఁ బ్రత్యక్షమీవు!
నీయునికియట్ల చిత్రంబు నీదుబలము!
నిన్నునమ్మిన నగునేమొ యెన్నఁగలమె?

(ఇంచుక యోజించి) ప్రమద్వరయే నాప్రపంచము; నాకామె తోడిద లోకము!

సీ॥ నాపూర్వ పుణ్యంబు నామోము లిఖితంబు
లలితశిరీష కోమలశరీర!
నామోహవారాసి నావలపులపంట
సంపూర్ణ పూర్ణిమా చంద్రవదన!
నామనోహారిణి నాజన్మ కారణం
బతుల గుణగణ రత్నాకరంబు
నాసన్నిధానంబు నాయర్థ దేహంబు
ప్రవిమల వికసిత పద్మనేత్ర

తే॥ గీ॥ నాప్రమద్వర గలదేని యీప్రపంచ
మెల్లసంతోషధామమై యెసగుచుండు
నామెలేకుండునేని, గాఢాంధకార
మెల్లయెడల గ్రమ్ముకొనెడి నిష్టలీల

హా! ప్రిమద్వరా! ప్రమదాశిరోమణీ! నేఁడు నిన్నుఁ జూడమి నా గతి యిట్లు వ్యాధుల పాటంగుచున్న యది. నిను బాసి నిలమట దుః గాకుండు నే?

తరుణీరత్నము మైలతంబెనఁగి చేతఃప్రీతినాచూపుతోఁ
గరయంబారగ నుల్లసిల్లిసుమ సంగాతంబునై యొప్పి, మో
దరసంబాత్మజనింపఁ జేసెడిని, సాదంబొందునో, లేక సం
బరమేయిచ్చితరింపఁజేయునో మనోవాంఛల్తుర్వమ్ముట్టగన్

(మోమెత్తి యోజించి, సవిచారముగా) ఔరా! నేవర్తింపఁ ంనది దుర్మార్గము గదా?

జననంబొందితి నేకులంబునవో లేశంబైనఁబోల్పంగరా
దు; నిరూపింపగఁ దల్లిదండ్రులెవరో దోషంబుగాకుండ ప్రే
లునొకింతైనఁ గదల్పలేను; విదితా శ్లోకంబునేనామెపై
మనముంనిల్పుటపాపహేతువిది దుర్మార్గంబుమమ్మాటికిన్

జన్మస్థాన మెద్దియో, మాతాపిత లెవ్వరో, నిజాభిజాత్య సంప్రతి యెట్టిదో, యెఱుంగక, పరుల పంచలఁ బెరుగు నేనేడ, సద్గుణరంబ, పాలితాఖిల లోక సౌందర్య విరాజమాన, మానవతీ లలామ, మే యేడ? తలపోయ నాకే సిగ్గగుచున్నయది.

గీ॥ పలుచకులమువాఁడ, యొరుల యెలమికలిమి
వలన భూతలమునఁ బ్రాణములనునిలిపి
చలనమూనెద; ఎలనాగ వలని ప్రేమ
దలఁపనాయెడ మలినంబు తులవదనము

ఆమెను దలంచుటకైన నేనర్హుండఁ గాను. కటకటా! ప్రిమద్వరా!

 ప్రమద్వర

ఆ॥ వె॥ అమృతకణము; ప్రవిమలాహ్లాదజనకంబు;
నిర్మలాత్మకంబు నీదుపేరు
నారసనము జేరి నీరసమొందెను
గనులలో సువర్ణ కలికరీతి

నిశ్చయముగా నేనామెయెడ ద్రోహచింత జేసితిని. కృపావర్షుండగు పురీంద్రసేనుండీసంగతి యెఱుంగు నేని యెంతవిచారించును; కోపగించును; మఱియు నెంత నొచ్చుకొనును. అభిమానధనుండు సుసేనుండీవృత్తాంతమించుక యెఱింగిన నెంతచింతించును; నన్నెంతదూలనాడును. ఛీ! నేనుకృతఘ్నుండను. ఇస్సీ! సుదతీలలామ ప్రమద్వరయే యెఱుంగు నేని, నన్నెంతగా దూషించునో; తానెంతసిగ్గుపడునో?

తే॥ గీ॥ గోముఖవ్యాఘ్రవతార! పయోముఖవిష
కుంభమహాహా! వీనియెడల్ల కూర్మిం దలంప
బాధయేకాదు, మఱియును పాపమగున
టంచుం దలపోయదొక్కొ శీతాంశువదన!

(ఒకింత యోజించి) ఏమి! ఈ భ్రమ? ఏవస్తువు సర్వవిధముల లోకజాలములలో నెల్లం బ్రిత్యగ్రంబో, దానియందుం బ్రేమ జనించుట సహజము;

మ॥ ధనమాలక్షులొసంగినన్ గొనదు;సత్పాత్రంబుబాటింపంబో
దు;నిమిత్తంబుం బరిత్యజించు; మదిలో దూరంబునన్ నిల్పు కా
రణసంబంధలతావితానములం, జేరంజీరు నేవేళలన్
ఘనులన్ నిర్మలప్రేమనైజమది, శక్యంబా నెయొండొటకున్

ప్రమద్వరలోకోత్తర. తత్కారణమున నామనోరాగమునకుం బాత్రభూతమైనది. ఆమెమనస్సరోంబుజాతనివాసిని యగు మధుపము. నా

సుందప్రతిభ. (యోజించి) నాయెడనామె కెట్టియభిప్రాయముగా? నన్నామె నిర్మలానురాగమునఁ జూచునా? ఉత్తమకన్యకు నుత్తమునియందు సహజముగ జనించు ప్రేమ నాయందామె కుత్పన్నమగునో! ఏలకో నాకామెయందట్టి నమ్మకమున్నయది.

నను జూచు వేళల నగుమోముతోఁ దుత
నెదు రేగి డెంచి సమ్మదమొసంగు
జిలిబిలి పలుకుల నలరి నామాటల
దిన మొక క్షణమని తెలియఁబలుకు
అనుజన్మ నెడబాసి యారామసీమల
కోకిలధ్వనివినఁ గోరునన్ను
హంసతూలికతల్పమందున శయనించి
కలలోన నను గాంచి పలవరించు
నాఁడు పంజరంబును బాసి కీడుపడిన
శారికారత్నమును దేరఁ జన్నువుమీరఁ
బంపునప్పుడు నాపైని బరపుచూపు
లవియివి తలపోయ హృదయ మరయలేనె?

నాయందామె కెడలేని మైత్రి. త్రికరణశుద్ధిగా నానమ్మకమిట్టిదే.—

(ప్రమద్వరనుద్దేశించి)—

అలదినంబున ముల్తాను నందుఁ గ్రూర
సింహదంష్ట్రల బలము నశించువేళ
యొకక్షణంబైన నను బాసి యుండలేదు
నీవ సేనల నొనరించి నాపుగడఁగి·

అప్పటి నీవిమలానురక్తి, నిజమైనభక్తి, మధురప్రసక్తి, సమయ ముచితోక్తి! నాహృదయఫలకమున సువర్ణాక్షరముల లిఖింపఁబడినవి.

(నేపథ్యమున 'విజయసేనా! విజయసేనా!' యనుపిలుపు)

వి. సే—(ఆలించి) తమ్ముఁడు సుసేనుఁడిట వచ్చుచున్నాఁడు.

తే॥ గీ॥ జలదములను తెరనుదాటి వెలికివచ్చు
తరణిబింబంబు వెలుఁగు భూతలమునెల్ల
వెల్లజేసెడు చందాన నుల్లముల్ల
సిల్లుసంఫుల్లముగ వీనిఁజేరునపుడు

(సుసేనుఁడు ప్రవేశించును.)

సు—అన్నా! విజయసేనా! ఒకండవై యాలోచనాధీనుఁడవై యున్నా డవేమి? నీగంభీరవదనము విలాసము జూపట్టకున్న దేమి?

చ॥ కలిమితొలంగెనో? రిపుల గర్వముసర్వమురూపుమాయదో
చెలిమిదలంపఁడాపిత? కృశించెనొనీదుయశంబు? బాల్యచా
పలమున నాసహోదరి నెపంబులువెట్టెనొ? హేతువేమి? నీ
వలసినదేమి? నాకెఱుఁగఁ బల్కి కృతార్థునిఁ జేయవేసఖా!

వి. సే—సుసేనా! నాకువిచార మెట్టిదియును లేదు.

తే॥ గీ॥ సదమలాంగి ప్రమద్వర సంతసాత్మ
యేని, నీయనురాగము హానిఁజెంద
దేనిఁ, యప్పగారువిడవ రేనినన్ను
గలుగ దణువంతయైనను గలఁతమదికి.

సు—అన్నయ్యా! నీవుసంతోషవంతుఁడవేని నాకభిమతసిద్ధియుదియ. వి నోదార్థ మొకనాఁడు ప్రమద్వరతో వేటవిషయ చర్చఁజేయుచుఁ, ద ద్వ్యాపారములయందు మనకుఁగల నేర్పు విశదంబుగ వర్ణించితిని.

సీ॥ గండభేరుండముల్ గహనభూముల లేవు
సింహశార్దూలముల్ క్షీణమొందె
చమరీమృగంబులు సన్నగిల్లెరయంబ
భల్లూకసంతతి పలుచనయ్యె
వేదండతండముల్ విడివడిపారెను
వాజులు కరవాయె భయముజెంది
మృగములు తెగలుగా మేయుచుఁ దిరుగాఁడు
పక్షిసంతానముల్ వలసవచ్చె
తే॥ గీ॥ విజయసేన సుసేనులన్ వీరవర్యుల
కౌశలంబున వనరమ కనులవిందుఁ
గొల్పి వరలుచున్నది సుమీ కువలయాక్షి
యనుచు సోదరితోడ బల్కాడినాను!

వి. సే — (నవ్వుచు) ఆమెయేమన్నది? నిజమని నమ్మికొన్నదా?

సు — నమ్మికొన్నది. ఇంతకు నీయతిశయోక్తి దోషముదవంతైనఁ గలదే? ముల్తానునగరలక్ష్మి పైటచెఱఁగువలె విరాజిల్లు నీయరణ్యప్రదేశము పూర్వము భయదావహమై యుండెనుగదా? జవాశ్వముల నధిరోహించి సునిశితబాణజాలములు గేలఁ గీలుకొల్పి మనమిరువుర మీనిబిడాటవినిఁ బ్రవేశించినది మొదలు క్రూరమృగంబొకటియైన నందుఁ గానవచ్చినదా?

వి. సే — తమ్ముఁడా! నీపలుకనూనృతమని యెవ్వరెఱుంగరు?

సు — ప్రమద్వర నాపలుకులకలరి, తులలేని సంతోషకలితయై,

" ఆ॥ వె॥ సవ్యసాచితోడ సమకొను విలుకాఁడు

# ప్రమద్వర

విజయసేనుఁడెట్లు వేటలాడు
గనుఁగొనంగ నిచ్చ గలిగెడు నను వెంటఁ
దీసికొని జనంగదే సుసేన! ”

అనిప్రార్థన మొనరించినది. విజయసేనా! నీయందామెకు మోహమో టమిలేదు. ఆమెయే వచ్చి నిన్నుఁ బ్రార్థించును.—

వి. సే— సోదరా! క్రొత్తవానివిధంబున నాతోడ మాటాడెదవేమి? మృగయావిహారార్థ మెప్పుడు పోవుదము? నేఁటిసాయంకాలము—

సు— సుమిత్రుఁడు సర్వము నాయత్తపఱచును. వానికనుజ్ఞయిచ్చితిని. సముల్లసితుఁడవగు విజయసేనా! ఈవుపోవుదము. సోదరి యిటకువచ్చును. నేఁబోయివత్తునా?

వి. సే— (సు. కౌఁగలించుకొని) అనుంగుసోదరా! అప్పగారియనుమతి వడసితివా?

సు— వారికింకను దెలుపలేదు. అభ్యంతరము జెప్పరని దృఢనమ్మకమున్నది.

వి. సే— సరియె.

(సు. నిష్క్రమించును.—వి. సే. లోనికరుగును.)



శ్రీ

# ప్రమద్వర

## ద్వితీయాంకము

### ప్రథమరంగము



(ప్రదేశము. శ్రీనగసమీపారణ్యము. ప్రవేశము వనపాలకులు.)

గరుడధ్వనిరాగము.— ఏకతాళము.

(అందఱు) దండిమగలు రండు కోదండపాణులై
చండశరభ సింహ వేదండతండముల్
నిండుభీతినుండ వే కొండగుహలలోఁ
రండురండు సేయఁగా గుండపిండిగాఁ

కవిరాజవిరాజితము.

ప్ర-సునిశిత బాణముశోణితముజవిచూడగనెంచెదుచూడుమురా
ద్వి-గుణధ్వనివీనులకుంగడువేడుకగొల్పిమృగంబులఁగోరెదురా!
తృ-వనమునభీకర ధ్వానములెల్లెడ బారమెరుంగక వర్తిలెడుఁ
తురీ-మనమునధైర్యము మానకు, స్థైర్యము మందమొనర్పకుమా! హితుఁడా!

ఉత్సాహ.

తృతీ—జాలిదూలికూలఁజేతుఁ జలము బలముఁ జూపు సిం

హాలపులుల కులమునెల్ల యమునిఁ బ్రోలికంపెదన్

ద్వితీ—మేలుమేలు జాలమేల? మేటిబలిమిఁ గూల్చి, ము
త్త్యాలురాల్తు కరులకిరుల తలలు జెండి దండిగాన్

తృ—సీ॥ హరిణశ్రేణులఁ జంప నరుదెంచుపులులను
చిటికెలోఁ జంపెదఁ జటులగతిని

ప్రథ—వ్యాఘ్రాళి జడిపించు వన్యేభ సంతతి
ఖండింతు భుజబలోగ్రత వెలుంగ

ద్వితీ—కరికరేణులకుంభ పరికరంబున కాశ
యొనరించు హరుల మర్దనమొనర్తు

తురీ—సింహ సందోహంబుఁ జీరాడఁజేసెదు
శరభాళి తీవ్రశస్త్రమున వేతు

తృతీ—తే॥ గీ॥ శరభములఁ దన్నుకొనిపోవ చదలఁ దిరుగు
గండభేరుండముల బాణ ఘాతమునను
గాసి పెట్టెద నిష్పాడ కరువలివడి
గడచియేగెడు మార్గణ గణముగనుడ!

(బాణము పైకి విడచును.)

ప్రథ—ఆ॥ వె॥ ఏదిజాంబవంత మేక్షి జంబుకములు
రాదు పక్షికులము రావు లేళ్లు
సాంద్రవన్యభూమి సత్త్వసంభూతంబు
గాదు నాదుబలము కలిమివలన

కవిరాజ విరాజితము.

ప్ర-అదిగదిగో పులి యాశరజొంపమునందున డాగె భయంకరమై
ద్వి-పదిలము సూ! గురిఁ బాయకురా! యొకబాణము వేయుము వైళముగా
తృతీ-హృదయమునన్ భయ మించుకలేక నహీనపరాక్రమవృత్తిని దే
యెదురుగబోయి వధింతు గనుంగొను మీమది కబ్బుర మిచ్చెదరా!

(అనిపరుగెత్తును.)

తురీ—గొప్పసెప్పి గుప్పునఁ గప్పగరితు వేసితివి! జాగ్రత్తసుమా!
(భయముతోఁ జూచుచు) అరరే! దుష్టవ్యాఘ్రము వానిపైఁబడినదే! మిత్రమా! ఆగుమాగుము! భయములేదు! (అనిపరుగెత్తును)

ప్రథ—(చూచి) కటకటా! పరాక్రమోపేతులు, భయంకరాకారులు, వన్యమృగంబుల ధిక్కరించుబలయుతులు, నాకూర్మి చెలికాండ్రు, విలుకాండ్రు నేఁడొక పిఱికిచారల మెకంబున కాహారమైరి. వారిమరణమునకు వారిదురదృష్టమే కారణము! మిత్రులారా! మనముసత్వరమపోయి యీవార్త సుసేనవిజయసేనుల కెఱింగింతము. వారిప్పు డుత్తరదిగ్భాగమున్న వేటాడుచున్నారు.

(నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము

ప్రదేశము—ఆదేయడవి.

(ప్రవేశము—విజయసేనుఁడాయాస మభినయించుచు.)

అబ్బా! పాదుమృగమెంత యాయాసపెట్టెను! అంపవానఁగురిపిం

చినను, కరఘాతంబున నొంచినను, జంకదయ్యె. ఆయిద్దరివనపాలురఁజంపి సౌదామినివలె రెప్పపాటులో నుత్తరదిశకేతెంచినది. నాఁడుముల్లాను నగరమున్న నన్నెదిరించిన సింహము నేవిధముల నివతీసిపోదు. మునే నదుమారుఁడు గొంతదనుక దాని నెదిరించి, భయంకరశార్దూలము నొంగుగాంచి, తద్దేశకు వడివడిహూంకుంబుసు బరుగెత్తించెను. ముష్టాత్రిష్టాలఁబెట్టి యెట్టకేలకు దానినిసంహరించితిని. (నలువైపులఁజూచి) అబ్బా! వనరమ చీకాకుపడియున్నది!

ఆ॥ వె॥ కిరులశిరములు వన తురగచరణములఁ
గలిసె; కుంభికుంభములు, విఖండ
చండతుండవితతి, శశక మొండెములును,
పారెఁ దేలి నెత్తుటేరు లందు

(ధనుస్సునుద్దేశించి)

ఉ॥ కండలుమొండెముల్ నిశిత కాండవిఖండితజంతుతండముల్
గుండెలుదూలి ప్రాణములు గోల్పడియుండినవేటకాండ్రను
ద్దండత నీవొనర్చిన ప్రహారిదంబునఁ దేలుచు నున్నవారు; కో
దండమ! శాంతిఁబొంది భుజదండము నెక్కి వికాశమొందవే

(ముందునకుజూచి) ఆహా!

తే॥ గీ॥ అమలజలజాత రస్య హర్మ్యాంతరమున
లీల నుండు కలిమిజవరా లనంగ
నరుణకాంత మణితలమం దధివసించి
వరలుచున్నది యదె ప్రమద్వరసుమాంగి!

ఆమెనుసమీపించెదను. ఏమి!

తే॥ గీ॥ వెలఁది ధమ్మిల్లసౌరభోవతులను గలిసి

మేనిపూఁతల వాసనఁ బూనిమంద
మందయానము గ్రాల నానందమొంది
యనిలుఁడు మదీయ యాయాసమును హరించె!

ఆహా! ఆసోయుగ మేమనందగును!

తే॥ గీ॥ అరయ నీరేడు లోకము లందుఁగలుగు
లలితలావణ్య సంగ్రహ లక్ష్మియనఁగ
కుందనపుఛాయ వెలుఁగొందుకుందరదన
గనిన దీనినిగన్నులు గనిన ఫలము!

( ప్రమద్వరను సమీపించును. ఆమెయాసనముడిగ్గి ససంభ్రమయై )

మణిగణనికరము.

జయము! జయము! శుభచరిత! గుణగణా!
ప్రియజన సమహిత! విమతజనహరా!
నియమిత సవినయ! నిరుపమ బలయుతా!
జయము! జయము! సుమశరసమప్రతిభా!

విజయసేనా! వేఁటతమకంబునఁ గరంబు నాయాసమొందితివి. ఈయాసనమధిష్ఠింపుము. ( వి. సే. ఆమెసమీపమునఁ గూర్చుండును. )

ప్ర — తే॥ గీ॥ కరమున శరనికరములు గరము మెరయ
నిరుపమగుణార్ణవము మది వెఱఁగు వెఱపు
సరభసముఁగొలుప, తురఁగ, పరముబరుగు
పరుగునఁ జనఁ గనవలెను దరమె పలుక?

వీరావతారా! నీనైపుణ్యమ్ము వర్ణనాతీతము! నిన్నెట్లుగొనియాడుదును?

వి. సే — కాంతారత్నమా!

ఆ॥ వె॥ నాపరాక్రమంబు నీవొగడ్తకు దగ
దైన మిక్కిలి కొనియాడినావు!
నీకు నాదెసఁగల నిరుపమానాభిమా
నంబుగారణంబు కంబుకంఠి!

మరియును,

తే॥ గీ॥ ప్రేమయను సులోచనములు బెట్టుకొనిన
వారలకు స్వభావోక్తియె వరలు నతిశ
యోక్తి సతము; తత్కారణ మోలతాంగి!
నీబలంబొట నీమాట, నిజము సుమ్మి!

ప్ర — (దరహాసవదనయై) విజయసేనా! నీవచనములు సుధారససేచన
ములు. సుసేనుఁడింకను రాడయ్యె నేమి?

వి. సే — ఆముష్యన్నె మెకంబు ప్రదర్శించిన పరాక్రమంబున కోర్వఁజాలక
యాతఁడొక శార్దూలమును దూరమునఁ జూచి దానిపైఁగవిసెను. దానిని
సంహరించి యాతఁ డిప్పుడే రాఁగలఁడు. ప్రమద్వరా! వనలక్ష్మి నీ
సౌందర్యమును గాంచి, నిజౌన్నత్యమున నిరసనభావమెఱింగి సిగ్గును,
విచారమును బెనంగొన సోయగముదొఱంగి యెట్లున్నదో చూడుము!

ప్ర — విజయసేనా! సౌందర్యాసౌందర్యములు మనోగతము ననుసరించి
యుండును; ప్రపంచమునందిది సుందరమగువస్తువు, అదియనాకారమగు
వస్తువు, అనియెడు భేదము వస్తుప్రకృతియందుఁ గానరాదు; మనోభి
రామ మెట్లో యట్లయుండును.

తే॥ గీ॥ గగనమున మేఘమాలికా గతులగాంచి
మిఱిమెఱుంగని సంతోష యుతుఁడొకండు

తద్విలసనం బెఱుఁగనైనఁ దలఁపఁ డితరుఁ
డొకఁడు; ధవళ సరోరుహ మొకని కింపు
మఱియు నొకనికి విందగు నరుణ కమల
మింకొకనికిఁ బ్రియముగాన మెట్టిదైన;
వినఁడు మధుర రుతంబులు వేఱొకండు
ఇంకొకఁడు ' తోడి ' రాగమేఁ యిష్టపడును;
ఒండొకండు ' మోహన ' విన నుత్సహించు!
విమలభావంబు వాంఛించు వేఱొకండు
మలినభావ మభిలషించు మఱియొకండు
సత్యవాక్య కలాప వాసన యొకండు
గోరు, నితరుఁడొకఁడు భూత కోటియందు
దయఁదలంపవలయునని నియతిఁబూను;
వీనికారణంబరయ నుర్వినిపదార్థ
నిచయములయందుఁ గలుగదు; నిజమనోము
కురము నందలి ప్రతిబింబ మురువిచార!

వి. సే— నారీశిరోమణీ! నిజముపల్కితివి; గాని,

తే॥ గీ॥ తరుణి! నీపైని హృదయసద్మమున నెప్పు
డొయెఱుంగఁ బ్రేమాంకుర ముద్భవిల్లె
నాకు; దీనికారణము గానఁబడదించు
కేని యెచ్చోటఁ గలదొ నీవెఱుఁగఁ జెపుమ?

ప్ర— విజయసమానా! విజయసేనా!

ఆ॥ వె॥ తారనుండి యొండు తారకు వెలుఁగెట్లు
బోవునో, యటుల ప్రఫుల్లహృదయ
మట్టి మనముతోడ నానంద మొందును
ప్రకృతినైజ మిద్ది పరవిదారి!

వి. సే—కన్యారత్నమా! నాయదృష్ట కేదారము పండినది. నాజన్మము కృతార్థతఁ జెందినది. నాహృదయ ప్రదేశమున నిర్మల సంతోషవాహిని ప్రవహించు చున్నది. నాశరీరము వివశత్వమొందుచున్నది. అహా! నేను ధన్యతముఁడను! ననుబోలు కృతార్థీభూతుఁ డీలోకంబుభూముల నెందైననుండునా? వేయినాలుకలు దాల్చి, యుండఁడని చాటఁగలను. శరచ్చంద్రవదనా! సద్గుణసదనా! మున్నుఁ బుననిన్ను వరించి, భావించి, ప్రేమాతిశయమున నీసుగుణరత్న సంచయమును గణుతింపఁ బ్రయత్నించి, వాక్కులుసాలమి, విషణ్ణహృదయుఁడనై, కర్మలనిన్నలరింప యత్నించి సమయానుకూలముగామి, యెంతయాందోళనమొందితినో, యెంతసంతాపించితినో, మఱియు నెంతనాదురదృష్టమును నన్ను నేఁ దూలనాడితినో, మాటలఁ దేటతెల్లము సేయఁజాలను! నాపుట్టినకుల మెట్టిదియో యెఱుంగనివాఁడనగుట, నామాతాపిత లెవ్వరో తెలియని వాఁడనగుట, నీయాభిజాత్యగౌరవంబు, నీయనూన సౌందర్య సద్గుణవిశేషంబుఁ జూచువాఁడనగుట, నీయందుహృదయముఁ బదిలము సేయుట పాపహేతువని, విచారకారణమని హృదయము మరలింప నెంతప్రయత్నించితినో, నీరము ధారణీధరశిరోభాగమున కెట్లుక్రిందనుండి ప్రవహించును; ఎట్లుప్రజ్జ్వలిత జ్వాలాజాలమునఁబడి పరిమళనిలయమగు చందనమొలక జీవించును; అని నిస్పృహ జెంద క్షణక్షణమును బుద్ధిఁ దలపోసినను, కార్యము లేదయ్యె.

—రూపజితానంగా! కులాభిమానమీవిషయమునఁ దలపెట్టరాదు. నీవు వెలితికులమున నుద్భవించినట్లే భావింపుము; నేనుసత్కులప్ర

నూతననియే యెంచుము. అట్లయినను బాధయేమైన నున్నదే?

ఆ॥ వె॥ బంగరు నగయందు వరలి మాణిక్యంబు
నందమొంది నగకు నందమిచ్చు;
గుణముతోడ గుణము గూడి ప్రకాశించుఁ
గానఁ జింత దీనఁ బూన వలదు

వి. సే—అతివా! నిక్కము వచింతు వినుము.

చ॥ కనులను మూయునప్పుడు, ప్రకాశముగాఁ దిరుగాడు వేళభో
జనసమయంబునందు, నొక చక్కనివస్తువుగాంచునాఁడు, లే
క, నవనవోద్భవంబగు నొకానొక యూహకు నెమ్మనోతలం
బున మొదమొందు కాలమున మోహనబాణము! నిన్దలంచెదన్
ప్రియసఖీ!—

(కోపోద్దీపితుఁడై సుసేనుఁడు ప్రవేశించును.)

స్రగ్విణి

సు.—చాలురా! చాలు! వాచాట! దుష్టాత్మకా!
శీలమే నీకు దుశ్శీల! యీరీతిగాన్
కోలచేఁ గొట్టి నీగుండెఁ జెండాడెదన్
మేలురా! మేలు పాపిష్ఠా! మదాంధా! శఠా!

(తన్నఁబోవును.)

ఛీ! నోటికిఁ గలుపును ద్వారబంధమును లేదనుమాట నేటికిసూటి యయ్యె!

శా॥ ఓరీ! బాలిశ! వీరసత్త్వములు లేవో? దుష్టసత్త్వంబులన్
క్రూరాసిన్ దెగనేయరొక్కో? రుధిరాకూపారముల్ సేయరో

యీరీతిఁ బిడియంబుఁ బోనడచి, యేమీ? ప్రేమ వాక్యంబులఁ
యీరామామణితోడఁ బల్కితివి;నోరెట్లాడెరా? దుర్మతీ!!!

ఛీ! కులపాంశనా! వృథాడంబరా! ఛీ! విషోరగమా! నీముఖము జూడరాదు!

తే॥ గీ॥ వేఁటలాడంగఁ జనుదెంచి, బోఁటితోడ
మాటలాడెదు, హృదయంబు తేఁటపడఁగ,
సాటియెఱుఁగవు; పలుమాట లేటికింక
నేఁటికిఁగల్గె, కటకటా! చేఁటుమాకు

నాముంగలినుండి యావలికిఁ బొమ్ము. నీవ్యక్తి నాకుఁ జూడరానిది. నీవుమానవాకృతినున్న హాలాహలమవు! యుక్తాయుక్తములు నీకెట్లెఱుకపడును?

(సోదరితో) ప్రమద్వరా!

ఉ. అన్నవెఱుంగ వైతివి; కులాభ్యుదయంబుఁ దలంపవైతి వీ
వెన్నఁడొకింతయేని పిత యెంతపరాక్రమవంతుఁడో?
విన్నఁదనంబుఁగూర్చితివి వేపురిల్లోఁ దలయెత్తలేకనీ
చోన్నతినుండఁ గావలసె నూపిరి మేనులనుండు నంతకున్

అమాయకురాలా! కలహంసమెన్నండేని మాలకాకిలోఁ గలియునా? ఇఁక ముందు నీవెన్నఁడును వీనితో మాటాడకుము.

ప—సుసేనా! నీమాటలయర్థము నీవెఱుఁగుదువా? ఈవృథాకోపమునీకేటికి? మాలకాకి సాదృశ్యముఁ దేనేల?

మ. అనఘాత్మున్ మనతండ్రి నేమరుచ లేదావంత యేనిన్,కులం
బున కెగ్గేమియు నెంచలేదయిన నేమో! మోమునెత్తంగ లే

మనిపల్కాడితివక్కటా! యెఱుఁగవే యాహ్లాదమో? దుఃఖమో
యనుజన్ముండిటు లాడఁ బోదఁ ని దురాపవ్యాంబై నరోషంబుతోఁ

మఱియును, విజయసేనుఁడెఱుఁగనివాఁడనుకొంటివా?

చ. స్థిరమతినుండవే విజయసేనుని యందుఁ నిమేషమయ్యెనిఁ
ష్ఫురతరకోపమూనుటకు స్రుక్కఁగ నీయనురాగవల్లి, యీ
పరుషవచో విధంబునకు భావనసేయఁగఁ గారణంబు లే
దుర, తగురా! దురంతమురః; తొందరపాటువహింపఁగాదురా

సు—బాలా! జేలవు. ఈదుష్టులని మాయాజాలములఁ జిక్కితివి.

వి. సే—(శాంతముగా)

ఉ. సంబర సంభృతం బగు వచస్స్ఫురణంబు సదామనోంబుజా
తంబున నింపునింప, వినుతంబగునట్టి విధంబులెల్లఁ గ
ర్ణంబులఁ దన్పఁజెప్పెదవు నాయమెఁ? కోపవిషంబుఁ గ్రక్క, నే
రంబును ద్రోసినాఁడవు, కరంబుభరంబుభరింపఁ దమ్ముఁడా!

సు—నీవుమాటాడకుము. నీవచోమ్మారుతము మదీయకోపాగ్ని రవుల్కొ
ల్పెడిని.—ఇప్పుడు చాలాయాలస్యమైనది.

(తెరవైపుజూచి, యెలుగెత్తి.)

చ. జలరుహబాంధవుం డపరశైలశిరోగత మయ్యెఁ గావునన్
వలలను మూసి, బోనులను భద్రముజేసి, శరాసనంబులన్
గలియఁగఁగట్టి, జాగిల నికాయములన్ పడిగూడఁజేసి, వీ
థలసినవార లౌటను, వేనాటకులార! గృహంబుఁ జేరుఁడీ!

బోయిలారా! పల్లకి సిద్ధముజేయుఁడు.

(వింతముసలిది ప్రవేశించి)

సుకేశా! తొందరపడరాదు. ప్రమద్వర విజయసేనుని జన్మకారణము! (నిష్క్రమించును.)

సు—(ఆశ్చర్యముతో) సోదరీ! రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు.)

వి. సే—గతజలసేతుబంధన మవివేకలక్షణము! నేను నిజముగా తొందరపడితిని. హా! మోహమా! నీ వెంతసుందరవు! నిరవధికకృపాపరతంత్రవైనట్లెయుండి గండశిలకంటె యత్యంతంబగు కాఠిన్యమూనితివి! దావానలకీలావళిం బడంద్రోసితివి!—ఏమిది! నేనధైర్యమూనుచుంటినా? ఛీ! నాకిదితగదు.

తే. గీ॥ నిశ్చలంబపారంబు, వినిర్మలంబు
నిరుపమానంబు, నిత్యంబు నిశ్చయంబు
దివ్యమైనట్టి ప్రేమ సాధించు జయము
నరుగు సిద్ధి యాచంద్రతారార్క మగుచు

కావున నిందుయోచనీయాంశము బొడసూపదు. ముందుముందెట్టివి రానున్నవో యెఱింగి యెదుర్కొనవలయును. భానుమంతుఁ డస్తగిరి మాటునకేగెను. (ఉపక్రమించి) అకటా! సుసేనుని పరుసాలాపములు దలఁపునఁ బాయనపుడు గృహమునకుఁబోవుటకు మనంబంగీకరింపకున్నయది. సుసేనుఁడు జనకునకీవార్తఁ దప్పక యెఱింగించును. అతఁడేమనునో తెలిసినఁగాని కర్తవ్యమూహింపఁజాల!

(నిష్క్రమించును.)



## తృతీయరంగము



ప్రదేశము. పురీంద్రసేనుని గది.

(ప్రవేశము పురీంద్రసేనుఁడాలోచనాధీనుఁడై)

ప్రమద్వరకుఁ బదునాలుగేండ్లు నిండినవి. సంప్రాప్తయౌవనయగు టవలనఁ బరిణయమామె కొనరింపవలయును. ధనవంతుఁడును, గుణవంతుఁడునునగు నల్లునికై యరయ నవసరములేకయే, యీడఁబోయిన తీర్థమెదురైనటుల హేమపాలనృపాలుఁ డభిలషించి, ప్రమద్వర కరగ్రహణమునుగోరుచు. ఆతనికిప్పుడు నలుబదియేండ్లుండును! అయిన నేమాయెను శ్రీ సుభిక్షరాజధాని కళ్యాణిపురమునకధీశ్వరుఁడు. రూపమున జయంతుఁడు. విశేషించి నిర్వక్రపరాక్రమధురీణుఁడు. వానిఁజెట్టవట్టి ప్రమద్వర నిరతిశయానందమున నోలలాడకుండునే? చినతనమాది మరాళతూలికాశయ్య మేనువాల్చును. శాల్యన్నములు భుజియించును; విలువయెఱుంగని రత్నాభరణంబులు దాల్చును. హేమపాలునియింట నామెకష్టమెఱుఁగక మెలఁగఁగలుగునని నిండారుయభిమానము గలదు. కుమారుఁడు సుసేనుఁ డిందులకేమనునో? ఆతఁ డడ్డు చెప్పఁడనియే నమ్మకము.

(నేపథ్యమున)

తిప్పగారూ! రావచ్చునా?

పు. సే—(చూచి) సుసేనకుమారా!

తే. గీ॥ భీషణనినాద ప్రతినాద విపినభూమి
వేటలాడంగఁ బోతివి విజయసేను
తోడ క్రమ్మఱినావె సంతోషమొంది
రమ్ము! చల్లనికౌఁగిలి నిమ్ము! తండ్రి!

(సుసేనుఁడు తండ్రికిఁ బ్రణమిల్లును. పు. సే. కుమారుని గాఁగలించుకొని)

నాయనా! వేటతమకంబునఁ గరంబాయాసంబునొందితివి. కర పాదభుజియించి, సుఖశయ్యఁ జేరుము. ఆలస్యమొనరింపకుము. ప్రాత కాలమున సంభాషణము—

సు—(ఆక్రోశాక్రాంతుఁడై) జనకా!

తే. గీ॥ అడవి మృగముల జంపు నాయాస మొక్క
క్షణములోఁ బాసిపోవును గాని హృదయ
మునకుఁ గలిగిన శ్రమయెట్లు పోవఁగలదు
పాపవిధినిఁ దప్పింప నెవ్వని తరంబు?

పు. సే—(సంభ్రమవిచారములు మల్లడిగొన) హా! కుమారా! ఏమాయెను?

మ॥ అనఁగున్ జెల్లెలుషానిఁజెందెనో? ప్రియంబై యొప్పనీ పేరుదు
ర్వ్యయునల్ కేలియొనర్చిరో? తొలఁగనో ద్వేషంబుఁగీల్గొప్పిన
జ్జనుఁడౌ యూవిజయుండు? సింహముపసల్ చాటించిమాటయ్యెనో
యనయంబేమిజనించె? చెప్పుము కుమారా! వ్రాలుదూషింపకన్

తనయా! సునేనా! నాయాందోళన మధికమగుచున్నయది. కన్న తండ్రీ! నీకుఁగల్గిన సంతాపమేమి? తత్కారణమేమి? చెప్పుము నాయనా!

సు—జనకా! ఏమనిపల్కుదును? హా!

తే. గీ॥ మనసు కృతరాసి, మననిధి, మన గృహారమ,
మన ప్రమోదంబు, మనగుణమణి, మన నయ
నోత్సవంబు, మీసుత, నాసహోదరి యగు
మన ప్రమద్వర యిఁక మీద మనదికాదు!

పు. సే—హా! ఎంత దారుణమెంత దారుణము! హా! ప్రమద్వరా! హా! ప్రమద్వరా!—కుమారా! నిజముపక్కాణింపుము. నారత్నాలపేటి, నా

యామృతవల్లి, నా సుగుణరత్నాభరణము,— నా ప్రమద్వర యేమైనది!

సు— తే. గీ॥ ఏలతాంగిని ధనబల శీలములను
పరువు మర్యాదయును గలవాని కొసఁగి
పెండ్లిసేయుదు ననెద వావెలఁదిమిన్న
విజయసేనుని సొమ్మః సద్వినుతచరిత!

హా! దురాత్ముఁడు విజయసేనుఁడు మృదువచోరచనాకలాపముల వలన గోలయగు మన నీలాలకమనోజలజాతమును హరించెను. దుర్భరంబగు నిందతలపైఁ బడియెను.

పు. సే— కుమారా! నిజముగా నియ్యది దారుణకృత్యము.— హా! విజయసేనా!

చ. చిరుత తనంబునందు నను జేరఁగ, నా ప్రియసూనురీతి ని
న్నరయుచుఁ బెంచినాను, నినునమ్మితిసద్గుణమూర్తివంచు,ని
త్తెరఁగున నాగృహంబు గణుతింపక దారుణవహ్నిఁగాల్చితే?
కరుణఁదలంపనియ్యదియగా ఫలమయ్యెయయొ! మోసపోయితిన్

(దుఃఖమణఁచుకొని) సుసేనా! ప్రమద్వరమాట యిచ్చెనా?

సు— జనకా! విశదముగ నామెమానికి మనోగతమెఱింగించియుండలేదు. వాలుమెకంబొండు నాపఁగానరా సత్వరముగ హయమునుబరుగెత్తించి సేనాజంతువుపైఁ గవిసితిని. బాణపరంపరల దానింగూల్చి మగుడి వచ్చుచు దూరమునవిజయసేనుఁడు సోదరిపజ్జఁ గూర్చుండియుండుటను గాంచితిని. వారేమిసంభాషించుచున్నవారలో వినఁగౌతూహలాయత్తచిత్తుండనై హయంబుడిగ్గి మెలమెల్లన వారికిఁదెలియకుండ పారినిసమీపించితిని. అప్పుడు ప్రమద్వరసుస్వరముతో (ఆ. వె॥బంగరు నగయందు అనుపద్యముచదువును.) అనిపల్కెను. విజయసేనుఁడు మితి రొంటుంగని సంతోషభరితాత్ముఁడై యిట్లనియెను. (చం॥కనుఁగొను

మాయమైనప్పుడు అనుపద్యమును చదువును) నేను కోపోద్దీపితుండనై
విజయునిఁ బరుషోక్తులఁ దూలనాడితిని. వాఁడొడలగ్నిగుండమునఁ బడ
నట్లయ్యెను. వానినిఁ దన్నవలయునని పాదమెత్తితిని; వాని యదృష్టము
మంచిదగుట వెనుదీసితిని. సోదరితో గృహమున కరుదేరనుండు సమయ
మున వింత ముసలి దొకర్తు తత్ప్రదేశమున నవతరించి, "సుసేనా! తొం
దర పడరాదు. ప్రమద్వర విజయసేనుని జన్మకారణము!" అని పల్కి
వనమధ్యమునకుఁ బోయెను. ఆమె వెఱ్ఱిది. దాని మాటలు సరకు సే
య నేల? — అధూర్తునిఁ దొలఁగించిన నన్నియు సరళముగా జరుగును.

పు. సే — కుమారా! విజయసేనుని యందు ప్రమద్వర కనురాగ ముద్భవిం
చినదని తోఁచెడిని. ఆకారణమున, వాని నిటనుండి పంపించి వే
యవలయును; గాని యింతలో నట్లొనరింపరాదు. ప్రమద్వరకు వాని
యందభావము గలిగించిన వెనుక వానిని తొలఁగింతము. మోహాం
ధులకు యుక్తాయుక్తము లగోచరములు. విజయసేనుని జన్మవృత్తాం
తము మున్నే కదా, వాని సముఖమున నీతోడను, సోదరితోడను
జెప్పితిని. వాని కులమెట్టిదో, వాని జననీ జనకు లెట్టివారో, వాని
జన్మస్థాన మెందుననో, యెఱుంగుటకు వలయు తెరంగు లభింపదయ్యె
అట్టి దిక్కుమాలినవాఁడు విలాసినీ శిరోమణి యగు ప్రమద్వరనా క
న్నెత్తి చూచుట! కుమారా! ఈ యవమానము సైరపడునే? మనము
జీవములతో నుండి యేమి ప్రయోజనము! ఇందును గుఱించి శాంతము
గా యోజింపవలయును

(నేపథ్యమున)

దేవా! హేమపాల జనపాలుఁడు తన రాక మీకెఱింగించు
చున్నాఁడు.

సే—(ఆలించి) సుసేనా! ముల్తాను నగరమున నాఁడు మన గృహమున
కేతెంచిన కళ్యాణిపురవరు మఱువవు కదా? ఆ భూమండలాఖండలుఁడు
మనయందుఁ జూపిన నిరతిశయానురాగము మరువఁ దగినదా?
నాయనా! అతనిని సందర్శింతము. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## తృతీయరంగము



ప్రవేశము. వజ్రపాణి.

హేమపాలుఁడు ముల్తానునగరమునుండి నేఁడేయరుదెంచెను. నాయందాతఁడు నిండారు అభిమానమూని వర్తించుచుండును. నేనాతని కార్యతత్పరుఁడనై మెలఁగనిచో స్వామిద్రోహినగుదునుగదా! నేఁటిదనుక నేనొకమాఱైన నాతనియాజ్ఞోల్లంఘన మొనరించియుండలేదు. ఆతనిప్రీతి వర్ధిష్ణతకొంతయుఁ బాటుపడుచున్నవాఁడను. ఇప్పుడాతని మనోభీష్టమున కంతరాయముగలిగినది. పురీంద్రుఁడీసౌధరాజంబునఁ బ్రవేశించిననాఁడే విజయునివిధంబంతయును గ్రహించితిని. వెఱ్ఱివాఁడు, సుమిత్రుఁడు విజయునిమందహాస విలసితవదనము ప్రమద్వర మనోగతమున నెలకొనియున్నదనుమాట నేటికిని గ్రహింపఁడు! విజయుని చిఱునగవులు, క్రీగంటిచూపులు, దైన్యముతోడి తలపోతలు, భయరభసములు, ఏకాంతవిహారములు, నాతనిమనోగతమును గంభీరవాక్ప్రభిమకంటె నెన్నియోరెట్లధికముగాఁ దెలియఁజేసెడిని గదా! ఈపట్మలమును ద్రెంపివేయవలయును. (చూడ్ప్రసారించి) హేమపాలుఁడు భోజనాగారమునుండి వచ్చినాఁడు. శయనాగారముఁ బ్రవేశించెను. ఆతనిఁ సమీపించెదను.

(నిష్క్రమించును)



# ప్రమద్వర

## పంచమరంగము



(ప్రవేశము. హేమపాలునిపడకగది. ప్రవేశము. హే.పా.వ.పా)

హే.పా.—అవును. నీతలంపుసరియైనది. వజ్రా!

ఉ. పరమశీలలామ, శరదిందునిభానన, సింహమధ్య, సం
చారము సేయు నాహృదయ పద్మమునందున, నామె నెమ్మదిన్
జేరని దుష్టుఁడై విజయ సేనుఁడు? పాతకమంచెఱుంగఁడో?
సారసవైరి దోఁచె దివసంబున! నేగతి శాంతిఁ బొందెదన్?

మిత్రమా! నావిచారము దుర్భరము!

సీ. పడఁతి సోయగమును బలువురు వర్ణింపఁ
గోరి యాకర్ణించి కొన్నినాళ్లు
సొగసుల దొంతినిఁ జూతునా? యని శంకఁ
గొని, తహతహపడి కొన్నినాళ్లు
పద్మాక్షి నన్ను సంభావించునా యని
విన్నఁదనంబునఁ గొన్నినాళ్లు
భామావతంసము బరిణయమాడునా?
నన్ను బాయునె? యని కొన్నినాళ్లు

గీ|| సంశయారూఢ డోలాయ స్వాంతుఁడ నయి
ఎంత దురపిల్లినానో, యా కంతుఁడెఱుఁగు
నా ప్రయాసము దక్కెనునాకు, తరుణి
విజయునకుఁ దక్కె, విధివ్రాలు వేఱబమొకో?

అకటకటా! యశోవిశాలుఁడును, ప్రతాపాలవాలుఁడునగు హేమ
పాలుఁడు నేఁటికి దైన్యమొందవలసివచ్చె! హా! కాలానుకూలము!

వ.పా — దేవా! పాపకర్ముఁడు విజయసేనుఁడు ప్రమద్వరస్మ్యాంగిని తన
వచోవిలాసముచే వశీకృతనొనరించుకొనియెను.

హే.పా — వజ్రా! నీవచించువది నిదర్శనమా! — హా! ప్రమద్వరా!

తే. గీ. మోహ దుగ్ధాబ్ధి యందున మునిగి తేలి
నీసమక్షమున నిలచి నెనరు జూపు
ప్రేయసీ! యని నోరార వేడుకొనఁగ
ముద్దు మోమును ప్రక్కకుఁ బోవద్రిప్పి
మధుర దరహాస మ్మొనరించి య్యధరబింబ
ము నొకియింత రడన కుంద ములను బట్టి
భ్రూలతలు మీదకు జరిగి ముడివడంగ
వదనమును ద్రిప్పి, ప్రణయ కోపమును జూపఁ
బైకొనెడు మోహామణపంగ బలములేక
సఖియ! నీబిగి కౌఁగిల్ది సమయరక్ష
ణంబటంచు నమ్మితి, నాదు నమ్మకములు
కలలు గాని, సుంతైన నిక్కంబుగావు
కటకటా! నేపడిన కడ గండ్లఫలము
పరిణమించెనె యీరీతి? (వ.పా.తో) వజ్రపాణీ!
ఈహృదయ వేదనంబు నే నెట్టులోర్తు?
దుర్భరంబు! దుర్భరము! హా! దుర్భరంబు?

వ.పా — పురుషాగ్రణీ! మీరీతిరున విచారమూనుటతగదు. సౌందర్యమున

మిమ్ముఁబోలువాని నొండొకనిఁగానము! గంభీరభావమున మీకెవ
వచ్చువారేరి! పరాక్రమక్రమమున మీకుమీరే సాటియన హాస్యార్థ
మగునే? నిరవధిక కృపాపరతంత్రా! ప్రమద్వరయగు ప్రమద్వర
మిమ్ముఁ బ్రేమింప నేరమికిఁ గారణము మీయందు నెరసులేమైనఁ గల
వనియా? కాదు! కాదు! విజయసేనుని మాయావాగురులఁ జిక్కి. పటి
లత్వమెఱుంగని యన్యాలోలాలక మీగౌరవము, అభిమానము, నిరుప
మానయశము, గ్రహింపఁజాలదయ్యె!

వే.పా— వజ్రపాణీ! నిజము వల్కితివి. లేనిచో,

చ. బలము, ధనంబు, నేడ్తెర, యపారయశోమహిమంబునీకులే
నిలలితరూపవిభ్రమము, నిల్కడఁ బూనినరాజ్యలక్ష్మి, నా
కులమునసాంప్రదాయమును గోరివరింపఁ దలంపులేని,యా
యలికులవేణి యేవిధమ యాతనినెమ్మదిఁ బ్రేముడించెడిన్

కం॥ మందులు బెట్టెనో? సుందర
మందాలాపంబు లాడి మనమును గొనెనో
యిందు నిభానన పొందును
బొందఁగ నేవిధమనేస్తు బొందుగఁ, జెపుమా

ప్రమద్వర నిజానిజము లెఱుంగనిది. ఒంటరిగానమ్మమటకైన సిగ్గు
పూనుచుండు. మఱియును, ఆగర్భ శ్రీమంతురాలు. విజయసేనుని
వృత్తాంత మాద్యంతమెఱుంగను. మనోవాక్కాయకర్మల వానిని
బ్రేముడించుననుట దురవగాహము. వాఁడు నింద్యతమమునిజంకక,
యామెకు మందులుబెట్టియుండును. కటకటా! ఈదారుణవార్త పురీంద్ర
సేనుఁడెఱుఁగఁడు. తెలిసియు మిన్నకుండునే?

పా— దేవా! విజయుఁడామెకు దూరమునసుండు నేని యింతపుట్టు నా?

వే.పా— నిజము! నిజము! ఓరీ! విజయా! దురాత్మా!

కం॥ ఎఱుఁగవా? సరసిజముఖి నా
కరమునఁ గరమిడి కరము వికాశముఁ బొరలన్
పరిణయ మగునని, మఱియును
పరిరంభణ సేయుననుచుఁ బాపవిచారా

తే. గీ॥ అరులనాహవరంగంబు నందుఁ జీల్చి
పీల్చి పిప్పిఁ జేసి వెలయు భీకరకర
వాలమున్నది కేల! నీ వర్తనంబుఁ
గన్నులను విప్పిచూడరా! కాచికోర!

(ఆసనమునుండి లేచును)

వ.పా—(వారించి) దేవా! తొందరపాటు కూడదు. పురంధ్రునకీయుదంత మెఱింగింతము. ఆతని మనోగత మెఱింగినఁ గాని, కార్యాలోచనము నకుఁ బూనరాదు.

హే.పా—ఔను. పురంధ్రునకీ వార్తఁ దెలియఁజేయుదము. పిమ్మట కర్తవ్యమూహింపనగును. వజ్రా!

ఉ. వారిధులింకుఁ గాక, కుల పర్వత సంతతి క్రుంకుఁ గాక, దు
ర్వార యరాతివీరజన వంశ భయంకరమూర్తినై, దురా
చారపరుండు, నావిజయజాల్ముఁడు దానకృపాణపాణినై
పోరఁ దలంచుగాక! పువుఁబోణికిఁ బ్రాణములివ్వకుందునే?

వ.పా—దేవా! మీయప్రతిమాన పరాక్రమాభిమానము నే నెఱుంగనా? రేపు పురంధ్రసేనునితో ముచ్చటింతము. ఇప్పుడు చాలా యాలస్యమైనది. మీరు నిదురింపుడు. నేఁ బోయివచ్చెదను.

హే.పా—సరియె. ప్రాతఃకాలమున మరల కలిసికొందము.

(వ.పా నిష్క్రమించును. యవనిక పడును)





# ప్రమద్వర

## తృతీయాంకము

## ప్రథమరంగము



ప్రదేశము. శ్రీనగరసమీపారణ్యమునం దొకదుర్గము.

(ప్రవేశము పులింద కళింగులు)

పు — తమ్ముఁడా! నీయభిప్రాయము సమంజసముగా నున్నది. నాకిప్పుడు నలుబదియేండ్లు.—

క — అన్నయ్యా! ఏమట్లనుచున్నాడవు. దేవనారీమణులు నీదోర్దండమున విశ్రమింప నెంతయో తపింతురు; ఇంక భూలోక నారీరత్నములమాట వేఱుగఁ జెప్పవలయునా? అప్రతిహతంబగు నీపరాక్రమంబెఱింగి, యెందఱెందఱు రాజన్యులు తమగాదిలికూతులను నీచరణసరోజముల కర్పింప నెంచి, నీవంగీకరింపమి చిన్నవోయిరి?

సీ॥ ముద్దులకుప్ప నా ముఱిపెంపు కూతును
గైకొను మంచు మాగధుడు బల్కె—
రత్నాల పెట్టె సువ్రతయగు నాకూతుఁ
జేపట్టుమని వేడె చేదివిభుఁడు
గొనముల ప్రోక నాకొమరారు కొమరిత
నుద్వాహమగునన నుత్కలుండు

భారతీదేవి నావరముల తనయను
గ్రహియింపుమని పంపఁ గాశిరాజు

తే. గీ. కానుకలతోడ వారల కబుతు లెల్లఁ
దిరుఁగఁ ద్రోలిన సంగతి మఱచినావె?
నీకుఁ బరిణయేచ్ఛ కలుగ నిఖిల రాజ
చంద్రు లొసఁగరే కూతుల సంతసమున!

అన్నయ్యా! నీవుపరిణయము జేసికొనవలయును. ఏలనందువా?

సీ॥ గగనతలము నంటి నగము మీదికిఁ బోవు
వృక్షంబులను ద్రెళ్ల నేయలేదె?
వణఁకి భూమియు నభోంగణము బీటలు వార
గడగడమని బొబ్బ లిడగలేదె?
గండభేరుండ వేదండతండంబులఁ
జిటికిన వ్రేల శిక్షింపలేదె?
బలదర్పయుతులైన వైరులు వెనుజూచు
కొనుచు భీతిలి నాఁడు చనఁగలేదె?

తే. గీ॥ మిగిలినార మిద్దరమెకా మేటివంశ
మున; నిరంకుశబలము స్థాపనమొనర్చి
పోవునాఁడదియు నశించి పోవవలెనె?
బుద్ధిగలవాఁడ వెదఁ దలపోయు మన్న!

పు—తమ్ముఁడా! స్త్రీయనుమాట వినినప్పుడు కర్కశంబైతోఁచుచుండె
డిని. కొన్నాళ్లనుండిమాత్రము నాయందా భావము మార్పుఁజెందినది.

తే. గీ॥ ఎద్ది హాలాహాలం బని యెంచినానొ
యదియ యమృతలహరి యని యెద నెఱింగి
నాను; కుసుమకోమల గాత్ర మైనఁ గాని
జ్వలిత కీలయటంచు నే జంకినాను!

దుర్జయుంబగు మనవిక్రమంబును భూచక్రమున నిర్వక్రముగ నా చంద్రతారార్కము నిలుపవలయునని చెప్పుచున్నాడవు. నిజము. మరియొక విషయము గూడ కలదు. నీయందు దాపరిక మేటికి?

తే. గీ॥ పూల పానుపు నందునఁ బొరలుచున్న
మూయఁ బడదు నేత్రయుగము మునుపటివలె
నెంత మధుర వస్తువయిన నించుకేని
రుచి యొసంగదు; తోఁచును రోఁతగాను!

మ॥ మృగయాసక్తి నశించె; పల్కుటకు సుంతేనిన్ మనంబొప్పకో
దు; గురుత్వంబు కృశించె నాబలము పై; దోఁచెన్ మనోవీధిఁ జె
ప్పఁగ లేనట్టిది భావమొకఁడు; భరియింపన్ గష్టసాధ్యంబు; నె
వ్వఁగ యేతీరునఁ దీరిపోవుననుచున్ భావించి వేసారితిన్॥

నాకుపాయము దోఁచినదికాదు: ఒకనాఁడు మనసేవకుఁడు దుర్జయుఁడు నాతో ముచ్చటించుచు, దేవా!

కం॥ బలము, కులంబును, గలిమియు
విలసదనంబు మరియు సువివేకము నిండై
కలిగినఁ గలవాఁ డనుచోఁ
గలదొకొ యర్థంబు, వయసు గరితలు లేమిన్?

అనిపల్కెను. వానిసత్సూక్తి నాకిప్పు డనుభవమువలన సర్థమైనది.

తమ్ముఁడా! నీయుపదేశమనుసరించి, నేనొకకన్యామణిం బెండ్లి
యాడెదను.—

(నేపథ్యమున)

జయము! వనరాజా! పుళిందమహాశయా! జయము!

క—అన్నయ్యా! మనకు మూఁడవకన్నువలె వర్తించు దుర్జయుఁడు రోష
కషాయితనేత్రుఁడై వచ్చుచున్నాఁడు.

దు—(ప్రవేశించి, పుళిందకళింగులను నమస్కరించి, పుళిందునితో)
మహారాజా! దేవరవారి కర్ణేంద్రియములకు విందొనర్చు సుఖ
వార్తలఁ గ్రహించి నివేదించు దుర్జయుఁడు నేఁడు దారుణవార్త నొండు
చెప్పవలసివచ్చెను.

చ॥ కలఁడుకదా పురీంద్రుఁడను క్షత్రియవంశజుఁడా మహోగ్రసం
కలితుని గర్భశుక్తిమణి కంతుహయంబన వెల్గు దాని పెం
డిలియొనరింపఁ గాఁ దలఁచి రీవిబయల్పడ నెల్లరాజులన్
బిలచియు దానితండ్రి మిముఁబిల్వఁగ నెంచడు దర్పమెట్టిదో?

వానిగీటడంచి మాకులగౌరవమును రక్షింపవలయును.

పు—(కళింగునితో) తమ్ముఁడా! వింటివా? పురీంద్రసేనుని గర్వనిర్వాప
ణంబు సేయనిచో మనమర్యాద నిలుచునే?

తే. గీ॥ గడగడమని పుడమి భయపడివడంక
పిడుగువడపున బెడిదంపునుడులు వెడల
చెడుగు పొడసూపెనని జనులడర నెడద
నడిదమునఁ బురీంద్రుసడఁతుఁ దడవులేదు!

క—అన్నయ్యా! పురీంద్రునిఁజంప నెంచ నేల? దుర్జయుఁడు చెప్పిన
[illegible] నసామాన్యయని జగతీజనంబులు

నిరంతరమును బొగడుచుందురు. నీవామెను ధర్మయుక్తి రాక్షసవిధి వివాహముగమ్ము.

పు— శెబాస్! కళింగా! నీయభిప్రాయము శ్లాఘనీయము. అట్లొనరించిన మనము స్థిరపఱచుకొనిన యుద్దేశముకూడ ఫలించును.— (దుర్జయునితో) ఓయీ! వివాహమెప్పుడో నీవెఱుఁగుదువా?

దు— దేవా! ఎల్లివివాహమునిశ్చయము. కళ్యాణిపురాధిపుఁడు హేమపాలున కామెనొసంగుదురు.

పు— సరియె. మనమప్రమత్తులమై యుండవలయును. దుర్జయా! నీవు గుఱ్ఱములు సిద్ధపఱచుము.

(దుర్జయుఁడు నిష్క్రమించును)

తమ్ముఁడా! భోజనానంతరము మనమేగి యబ్బాలికను దోకొని వత్తము.

(నిష్క్రమింతురు)

---

# ద్వితీయరంగము

(ప్రదేశము. ఉద్యానవనము. ప్రవేశము. ప్రమద్వర. రోహిణి)

ద్విపద

ప్ర— అంబరతలమున నమృతమరీచి
యంబుదచయముల నగపడఁడకట!
సౌరభవిలసిత సదమల్లిపుష్ప
మారనిచిచ్చున కాహుతియాయె!

తిమిరముగవిసెను తెలియదు దారి
నిమిషము హృదయము నిలకడగొనదు
జననముకోలె విచారములేక
మనితిని; యిపు డవమానము దోఁచె!
పెల్లివివాహ మనృతమొ? నిజంబొ?
తెల్లముగా సఖి! తెలియఁగఁబల్కు—
తాళఁగఁజాలను తాళఁగఁజాల
తాళఁగఁజాలను ధైర్యముఁజెప్పు!

కో—ప్రమద్వరా! భామామణుల తల మానికమవు! నీవిట్లధైర్యపడనగు నమ్మా!

సుగంధి

బేలవే లతాంగి! యిట్లు భీతిఁబొంద నెమ్మదిన్
చాలుఁజాలు! బాష్పధార జాలువార నేల్వకే?
శ్రీలుబొంది మోదవార్ధిఁ జేరి చెన్నుమీరఁగాఁ
జాలెదీవు హేమపాలు సద్మమందునన్ సఖి!

హేమపాలుఁడు తక్కువవాఁడనుకొంటివా?

పంచచామరము

సుమేరుధీరుఁ డుగ్రవైరి సూదనుండు, రూపునన్
సుమాస్త్రుఁడో, జయంతుఁడో, విశుభ్రమూర్తిచంద్రుడో
యమేయ సద్గుణాంచితుండు న్యాయశీలుఁ డాతఁడే
సుమా త్వదీయపాణిఁబట్టు శోకమేల? సుందరీ!

శుభము చేకూర విచారించెద వేమి? ప్రమద్వరా! నీవు నేఁజెప్పునంతటి దానవు కావు. విద్యలునభ్యసించినదానవు. యుక్తాయుక్తము లెఱుంగుదువు. నీవేయిట్లయిన, నితరకాంతలఁగూర్చి యేమిచెప్పఁగల వారము?

ప్ర— సఖియా! నీవు నా మేలుకోరుదువు. నేదుఃఖించిన నీవుకూడ కనుఁగవ కెంపువార దుఃఖింతువు. నాసంతోషము నీయది. నాకును నీయందట్టి భావముగలదు. నాహృదయము నీకు వెల్లడిచేసియుంటినిఁగదా? హేమపాలుఁడు పురుషోత్తముఁ డగును గాక; నాకాతనితోడిదేమి కలదు?

తే.గీ॥ అనునిమిషము మనోంబుజ మందు మధుర
మధువు స్రవియింప వరియింతు మహితయశుని;
సుందరాకారు, సద్గుణ బృందనిలయు,
విజయసేనుని రోహిణీ! వేయునేల?

రో— సఖీ నీయుద్దేశము నే నెఱుంగక కాదు; విజయసేనుని చరిత్రఁ నీవెఱుంగవొకో? వానియర్ధాంగివై నీవేమియనుభవింతువు?

మ॥ ధనమో? గౌరవమో? ప్రమోదమొ? మహోదారంబౌ
గారాబమో?
ఘనమందావిజయాభిధేయువరియింపన్ నెంతువశ్రాంతమున్
అనుజన్ముండతిరోషమూను, జనకుండా, పొందుసంతాపముల్,
వనితా! నాపలుకాలకింపు మతనిన్ వర్జింపుమా? వేడెదన్

మ॥ కులవిస్తారుఁడు, హేమపాలుఁడు, మనోగోళంబునన్ నిన్నుని
చ్చలువీక్షించిరమాక్షమారుదయ కాశల్యాన్ను; పూసెజ్జఁగ

న్నులుమోడ్పంగనుజాలఁడించుకయు, నీనోముల్ఫలంబొందు, నో
వెలఁదీ! నాపలుకాలకింపుమతనిన్ బెండ్లాడి మోదింపుమా?

ప్రే——రోహిణీ! నన్నుబాధింపకుము. చినతనమాదిగా మన మెట్లుపెరిగితిమి? నాకుంగడుఁ గూర్చుదానవు.

కం॥ గరళముఁ ద్రాగినఁ బ్రాణము
హరియించు నటంచు నెఱిఁగి యరవిందముఖీ!
కరుణఁ దొరంగి యొసంగెదు
భరియింపఁ దరంబె? విరసభావము దగునే?

చెలీ! హేమపాలుఁడు సుసేనసమానుఁడు. మనోసాక్షిగా విజయుసేనునిభర్తగా నంగీకరించితిని. కటకటా! దైవము నాయెడ ననుకూలుఁడు గాడయ్యె!

రో——ప్రియసఖీ! నీమాటలతీరుబాగులేదు. ప్రాతఃకాలముననే మంగళధ్వనులువినవచ్చును. పెండ్లికుమారుఁడు హేమపాలుఁడు నీపాణిసరోరుహమునకై నిమిషమొక యుగముగాఁ బుచ్చుచున్నవాఁడు. ఇత్తఱి నీయభ్యంతరము సమంజసమొకో?

సీ॥ భర్తృహర్మ్యాంతర భాగంబులందునఁ
దూఁగుటుయ్యేల లూఁగఁ దోఁచలేదె?
కమనీయ తరమైన కలహంస తూలికా
పాన్పుల శయనింప వాంఛ లేదె?
వెలలేని జలతారు వలువలు; రతనాల
తొడవులు, దాల్పంగ నెడఁద లేదె?
మధుర వస్తువులు, సమ్మదరసాంబుధిఁ దేలి

చెలియలతోఁ దినఁ దలఁపులేదె?

తే. గీ॥ దాస దాసీ జనంబులు తరుణ మెఱిఁగి
సేవ లొనరింపఁ గొన చిత్త వృత్తి లేదె?
చదువు కున్నావు గద పెక్కు శాస్త్రములను
సమదగజయాన! చనునె యీ సరణి నీకు?

వీఱిడియైన మానిసివలె మాటాడెదవు. అబలా! తలపోసి బదులాడుము.

ప్ర—చెలీ! తలపోయుట కిప్పుడాయారంభము? విజయసేనునకు నాహృదయము దత్తమైన కొన్నిదినంబుల కాయందంత మెఱింగితిని. నా యుద్దేశమీ వెఱింగియుండియు, నన్నీ తీరున వేచుచున్నదానవు. నామనో నిశ్చయము మఱొక్కసారి చెప్పెదను; పునరుక్తియనక వినుము.

చ॥ జనకుఁడు దూలనాఁడు; ననుజన్ముఁడు దగ్గరరాఁడు; నీవు వా
రినను కరింతు వింకనను ప్రేమగనుంగొను వారలందఱుం
కనులను నీరుబెట్టెదరు; గాని మనోగత మన్యమాటనే
మనినను లాభమున్నె? యతివా! పరతంత్రుల నీవెఱుంగవే?

కో—సరియె. విజయసేనుని వరించితినంటివి. అది యెట్లుపొసఁగును?

ప్ర—సకియా! ఈపటిమూహూర్తము దప్పిపోయినఁ జాలును. తరువాత నామనోభీష్టము సిద్ధింపకుండినమానె?

తే. గీ॥ ఎంతయో దూరమునఁ గల యిందుబింబ
మునుగనుంగొని వికసించి పొలుపు సూపు
కలువయును ధవళాక్షి! నిర్మల జలములఁ
గాంచునే ప్రేమ దూరము కాల మబల?

కావున రోహిణీ! కార్యము లేనిమాటలు మాని కర్తవ్యమూహింతము. శుభముహూర్తము నిశ్చయమంటివి. నాకేమి దారిచూపెదవు. గత్యంతరము లేనిచో భయపడుదానను గాను సుమా?

ఉ. చాలదె త్రాడు జానెడు; విషంబు కణంబు లభింపకున్నె; యే
మూలనునైన లేదె జలపూరితమైన తటాకమొండు; పో
గాలము రాదుగా శిఖికి కాంతె! యివన్నియు దూరమేని నా
వ్రేలున వజ్రమున్నది, హరింపదె ప్రాణము, మ్రింగునంతలోన్

రో—అమ్మా! ప్రమద్వరా! ప్రమాదముం దలపెట్టెదవేమే? శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్మను తొల్లిటి వాక్యము మఱచితివా కో?

ప్ర—హా! సఖీ! (కన్నీరు గార్చును).

రో—చెలీ! నీ మనోనిశ్చయ మెఱుంగంగోరి హేమపాలునిం గూర్చి యిట్లు నాక్షేపణించితిని. మనమిప్పుడు కర్తవ్యమూహింతము. ప్రమద్వరా! నీ జనకుండు మూర్ఖుండు గాడు. వాని హృదయమునం గరుణయను భావమించుకంతైనం బొడమియుండకున్నె? మనమిరువురము నాతనితో మన యుద్దేశ మెఱింగింతము. మన వేడికోలు బలహీనమైనను, బాష్పవృష్టి యాతని మనంబుం గఱిగింపకుండునా?

ప్ర—రోహిణీ! హేమపాలుని యందు నాకుంగల భావమును దండ్రిగారికి సూచించితిని. 'బాలా! మెఱయు వస్తువు లన్నియుం బంగారమని తలంతువు!' అని మెల్లన మందలించిరి. ఈ ప్రసంగావసరమున కరుదెంచి, నీతో సంభాషించిన, దుఃఖమించుకేని యుపశమిల్లునని తలంచితిని; గాని నీ యిష్టానుగతి మఱియొకసారి, నా కన్నతండ్రిని, నా మేలుం గోరువానిని బ్రార్థింతును. శరణాగత రక్షణ వత్సలుండే!

రో—అమ్మా! ఇప్పుడు చాలా యాలస్యమైనది.— (అడుగుల చప్పుడాలించి) ఎవరో వచ్చుచున్నట్లున్నది.

# ప్రమద్వర

(పుళిందకళింగులు ప్రవేశింతురు)

ప్ర—(ధైర్యమూని) అయ్యలారా! మీరెవ్వరు? మీయాకారములు చూడ కిరాతులవలెఁ దోఁచెదిని. మాయారామసీమ యథేచ్ఛఁ జొరుటకు సాహసింపఁ గారణమేమి?

క—విలాసినీ! ఈతఁడు పుళిందాభిధేయుఁడు; కిరాతరాజు. కళింగాంకుఁడనగు నేనాతనియనుంగు సోదరుఁడను. మా రాకకుఁ గారణమేమందువా?

ఉత్సాహ

పొలఁతి! నీవు మరుని సతినిఁ బోలుదానవనుచు, భూ
వలయ మెల్లనుగ్గడింప భావమందు మెచ్చి నిన్
వలచి యీపుళిందుఁ డిటకు వచ్చినాడు; ప్రేమయ
గ్గలిక మెందఁ బెండ్లియాడి కావు మోంతలోదరీ!

రో—(కోపముతో) ఓరీ! దురాత్ములారా! పురంద్రసేనుని గౌరవం బెఱుంగరా? సుసేనవిజయసేనులు మీదురంత మెఱుంగుదురేని మిమ్ముల నేమి సేయుదురు? మీవాచాలతఁ గట్టిపెట్టుఁడు.

పు.—(ప్రమద్వరతో) కాంతా!

పంచచామరము

చలంబుఁ బూనరాదు; తండ్రి చాల కోపమూనునా?
బలంబుతో సహోదరుండు వచ్చునా? భయంబులే
దు, లోకజాల మెత్తి వచ్చి దోర్బలంబుఁ జూపినన్
విలాసినీమణీ! యడంతుఁ; బెండ్లియాడి ప్రోవుమా?

ప్ర—పుళిందా! నాయుదంతము నీకెఱింగించుట యనవసరమైనను చెప్పెద నొండు మాటాలింపుము.

తృతీయాంకము

కం॥ పర నారీ రత్నంబును
పరిరంభణ సేయఁ దలఁపఁ బాప మటంచున్
గలుపవె ప్రామిన్కులు? దు
శ్చరితంబును జేసి కొనకు జన్మము, బలుఁడా!

పు—ముద్దుగుమ్మా! బంగరుబొమ్మా!

తే. గీ॥ ఎల్లిపరిణయము గద నీ వింతలోనఁ
బరసతివి యెట్టులైతివో యెఱుఁగఁజాల?
నేదియో వంకఁజూపించి యెట్టులేని
యాసలు నిరాశ లొనరింప నగునె తలఁప?

రో—పులిందా! నీవే యభిమానవంతుఁడవేని, వచ్చినదారిఁ బట్టి పోయెదవు.

క—అన్నా! సాధువాక్యములఁ బ్రయోజనము పూళక్కు.

పు—(ప్రమద్వరతో) అంగీకారమూని నామూపెక్కి వచ్చెదవా? లేక బలత్కారము సేయవలయునా? క్షత్రియులకు గాంధర్వ రాక్షసంబులుత్తమంబులు. నీయిష్టమెంన్నరింతును.

రో—హా! ప్రమద్వరా! దురాత్ములు నిన్ను విడతురే?
(ఎలుగెత్తి) విజయసేనా! విజయసేనా!

(పులిందుఁడు ప్రమద్వర నెత్తుకొని పారిపోవును. కళింగుఁడాతేని వెంట నంటిపోవును. రోహిణి మూర్ఛిల్లును. యవనిక వ్రాలును)



# ప్రమద్వర

## తృతీయరంగము



(ప్రదేశము. ఒకచావడి. ప్రవేశము వజ్రపాణి. సుమిత్రుఁడు)

వ.పా—సుమిత్రా! పుళిందకళింగుల దౌర్జన్యమెఱుంగుదువా? ప్రమద్వరను బలిమి నపహరించి పాఱిపోవు నపుడు రోహిణి యాక్రందన మొనరించుచుఁ దద్వృత్తాంత మెఱింగించుటయు, హేమపాలుఁడు వీరాతివీరుఁడగుటఁ, గరవాలమును ఝళిపించి, పురీంద్రునిఁ బురికొల్పి, సుసేనకుమారుఁడు వెంటరా, పరివారసమేతుఁడై హయంబుఁ బరుగెత్తించెను; అరణ్యప్రదేశమున వారలఁ గలిసికొనియెను. పుళిందకళింగులు మితపరివారులై యుండిరి. వారిమధ్య ప్రమద్వరఁ గానఁబడలేదు.

సు—తరువాత; తరువాత?

వ.పా—పిమ్మట హేమపాలుండెలుగెత్తి, "ఓరీ! మదాంధులారా! సుకుమారి ప్రమద్వరను స్పృశించి ప్రాణములతోఁ బోవఁగలరా? ఆగుఁడాగుఁడు!" అనిదిక్కులుపిక్కటిల్లఁ బలికెను. కళింగుఁడు పుళిందుని హెచ్చరించి, హయంబుఁద్రిప్పి హేమపాలునెదుర్కొనియె. తరువాత పోరుఘోరంబాయెను. హేమపాలుఁడు పుళిందునితోఁ రెండు గంటలు పరాక్రమంబు దీపింప ఖడ్గమునఁ బోరెను; దైవోపహతుఁ డగుట నాతనికరవాలము రెండుతునియలై పోయెను.

సు—(సంభ్రమమభినయించి) తరువాత నేమాయెను!

వ.పా—తరువాత హయంబుఁ డిగ్గి పుళిందునితో మల్ల యుద్ధమునకు సిద్ధపడియెను.

సు—ముష్టిఘాతమునఁ బుళిందుని నష్టపఱచి యుండునుగాఁబోలు?

వ.పా—అయ్యో! హేమపాలుని పరాక్రమాతిశయ మెఱింగిన వారెవ్వ

రట్లు దలంపకుందురు? దైవమాతనియెడ ననుకూలుఁడు గాఁడయె, పుళిందుఁడు భయంకరారావములు భూతలమున గ్రువ సేయ, మదకరీంద్రము చండాన హేమపాలుని పైఁబడి, పరశుపాతమ్ముఁబోలు ఘాతమున నాతనినుత్తమాంగము నొత్తివైచెను.

సు—కటకటా! కాలగతి! పిమ్మటజరిగెనేమి?

వ.పా—తరువాత, హేమపాలుఁడు మూర్ఛఁ జెందెను. నే నాతనిని, సమీప శీతలసికతాతలంబునకుఁ గొనిపోయి యుపశాంతి యొనరించితిని.

సు—సుసేనుఁడు కళింగుని గీటడంచెనా?

వ.పా—సుమిత్రా! ఏమిచెప్పగుదు? పురీంద్రసేనుఁడు కుపితారత్నాతీయుఁడై కళింగుని నెదుర్కొనియె. కళింగుఁడు బలమున నల్పుఁడు గాఁడు! పురీంద్రుని సైరించుచు, సుసేనునితోఁ బోరాడఁదొడంగె; గాని కొంత తడవునకుఁ జాలఁడయ్యె. సుసేనుఁడు వానినిహయంబునుండి క్రిందకుఁ ద్రోసెను. కొంతవఱకాతని ఘోటకమాతనిఁ గాపాడెను. పురీంద్రుఁడు కృపాణప్రహారమున దానినొంచి, కళింగునిఁ బనతిఁ వాసికి బలిసేయనుంకింపుడు, పుళిందుఁడు చండమారుతమువలె నాతనిపైఁ బడి, యెడలేనిదెబ్బల వితబలునొనరించి, మూర్ఛఁ బొందించెను.

సు—(ఉత్తరపాటుతో) పిమ్మట, పిమ్మట.

వ.పా—తరువాత సుసేనకుమారుఁడు భయంకరయుద్ధమొనరించి, పుళిందుని మూర్ఛనొందించెను.

సు—మేలు! సుసేనా! మేలు! తరువాత, తరువాత?

వ.పా—అత్తఱివడిపడియచ్చోటునకు ముసలిదొత్తు సంతోషాతిశయమున మిన్నందుచు, నరుదెంచెను. 'యోధవరులారా! పోరాటముడుగుడు! ప్రమద్వరయునికి సురక్షితము!' అనిగంభీరముగాఁ బల్కినది.

సు—(ఆశ్చర్యమభినయించి), వజ్రపాణీ! ఆముసలిదెవరు? నీకామెను

గూర్చి యేమైనం దెలియునా?

వ.పా.—సుమిత్రా! కొన్నిదినములనుండి యౌవనమున నామె వాస
మొనరించుచున్నయది. తఱచు వేఁటకాండ్రొసంగు మృగమాంస
మును భోజనము సేయును; మితముగ భాషించును. విశేషాంశము
లామెను గుఱించి నాకేమియును దెలియవు.

సు—ఆమెనుజూచినప్పుడెల్ల నాశ్చర్య మున్భవిల్లెడిని! ఆమెచరిత్రము
నుంతేని గ్రహణాసాధ్యము.

వ.పా.—నీవామె నెప్పుడుజూచితివి?

సు—ఆవృత్తాంతమాలింపుము. ప్రమద్వర కిరాతహతకుల బారిపడు
టయు, రోహిణి, "విజయసేనా! విజయసేనా!" యని యార్తనాద
మొనరించెను. పురీంద్రసేనుని శయనాగారమున నాతనికిమృదుశయ్య
రచియించి, మెట్లుదిగ క్రిందికివచ్చుచున్నెడ, రోహిణియొనర్చిన దీన
నాదము నా కర్ణపుటముల భేదించెను. రోహిణి మూర్ఛావస్థఁ దెలివొం
దిన దానివలె, నిడుదపెన్నెఱివేణి శీకొనపడి వ్రేలాడ, భయవివ
శయై, పురీంద్రుని గదివైపు పోవుచుండెను. నేనామెను జేరంజేరి,
"రోహిణీ! యుదంత మేమి?" యనియడిగితిని. ఉద్యద్బాష్పయై య
క్కామినీలలామ, రమణీయమగు పైటచెఱంగునఁ గన్నులుదుడిచు
కొనుచు, గద్గదస్వరముతోఁ బుళిందకళింగుల దుర్వర్తనాంశము నా
మూలాగ్రముగ నాకుఁదెలియఁజెప్పెను. తత్క్షణమ నేనామెను వీ
డ్కొలిపి, విజయసేన కుమారునకంతయు నెఱింగించితిని. విజయ
సేనుఁడు స్వార్థత్యాగి! ప్రమద్వర కీడువొందినవార్త నావలన నెఱిఁగి,
హాయారూఢుఁడై, యరణ్యమార్గముఁ బట్టెను. నేనును జవాశ్వమొం
డధిష్ఠించి యాతని వెంటఁ బోయితిని. దూరమున గజ్జపుర్ఘాతులు
కొందఱు కృశాంగియగు ప్రమద్వరను పల్లకియందిడుకొని, బోయలఁ
బ్రోత్సహించుచుఁ బోవుచుండిరి. అప్పుడు విజయుఁడాలుఁగత్తి,

మేఘగంభీరవాక్యముల వారినెదుర్కొనియెను.

వ.పా.—(ఆశ్చర్యముతో) తరువాత? తరువాత?

సు.—ఆగణ్యపురాతులు విషలిప్త సాయక సత్కారంబులను విజయుని మాటలకత్యంతాగ్రహంబొంది, యుద్ధమునకు సిద్ధమైరి. ఆసంకుల సమరంబున దుర్జయుఁడను పుళిందుని సేవకుఁడొ విజయసేనుని గరుణ నర్థింప, సహజదయామతియగు నాతఁడాతనిని క్షమించెను. వాని హయంబునుగైకొని ప్రమద్వరను దానిపైఁ గూర్చుండఁజేసి గృహోన్ముఖుఁడుగా నుద్యమింపుడు, నీవు పేర్కొనిన వింతమునటిది యటకరుదెంచి, కన్నులార మమ్ములఁ గాంచి, సంతోషాతిశయమున నొండేమియుఁ బల్కనేరక, దరహాస మొనరించి, యచ్చోటువాసెను.— వజ్రపాణీ! దైవనిర్ణయమెఱుంగుట దుస్సాధ్యము. కాదేని, నేఁడు మహావైభవముతో వివాహముజరుగ వలసియుండునుగదా? మన ప్రయత్నములు దైవమున కసంగీకారములుగాఁ దోఁచినవి. కటకటా! హేమపాలుఁడు గాయమునిండ గాఁగనికాయములు బాధింపఁబండుకొనఁజాలఁడు! కూర్చుండ నేరఁడు. ఆతనియవస్థఁ గన్నీరు వెట్టనివారెవరు? పురీంద్రసేనుఁడుగూడ కడుంగడు దురటిల్లుచున్నవాఁడు. ఆనందబాష్పములు విడువవలసిన దినమున దుఃఖకణములు విడువవల్లసివచ్చెను!

వ.పా.—రాజవైద్యుఁడూర లేడట; సమీపగ్రామమున కఱిగనటుల వార్త వినవచ్చెఁ. నేను సత్వరమ యాతనిఁ బిలువఁబోయెదను. హేమపాలుఁడు బ్రతికి బాగుండుటే కల్యాణము!

సు.—అవును. నీవు జాలము సేయకుము. మఱల కలిసికొందము.

(చెఱి యొక వైపు నిష్క్రమింతురు)



శ్రీ

# ప్రమద్వర

## తురీయాంకము

### ప్రథమరంగము



(ప్రదేశము. ఒకచావడి. ప్రవేశము, రోహిణి)

నెలదినములైనది ప్రమద్వర విజయసేనునిఁ జూడలేదు. ఆమె నానాఁటికిఁ గృశించుచున్నది.

చ॥ చనువున రామచిల్క యొక శ్రావ్యతరంబగు పాటఁ బాడునో
మనమున బొందకోయిల క్రమంబున దప్పక కూయునో? గుణం
బు నెఱుఁగఁ గోరి శారిక ప్రమోదము జిప్పిలఁ బిల్చునో? యటం
చు నెద భయంబునన్ జనదు చూడఁగ వేడుకతోఁట నెప్పుడున్
నేఁ డామె నన్నుఁ జేరంజీరి;

కం॥ జీవము దుఃఖముఁ బొందిన
నేవిధమున దేహముండు నెఱుఁగవె? జలమం
దావిరి జనియింపదె? పా
త్రావరణము శిఖినిఁ గాలు నప్పుడు సఖియా!

అని కన్నీరు జాలువారఁ బలికినది. కటకటా! విజయుని కరగ్రహణ వాంఛ కొనసాగుట యెట్లని యామెయొక నాఁడైన దుఃఖింపదు; భయపడదు. ఆతఁడిప్పు డొంటరియై యెట్లున్నవాఁడో, యెట్టి

యిక్కట్టు లనుభవించు చున్నాఁడో యని కరంబు దుఃఖించును.
అవును.

తే. గీ॥ మణికి కాంతియట్లు సుధకు మాధురీ గ
రిమ విధంబ, గులాబికి విమలసౌర
భము కరణి; ముని కానంద భాగ్యముగతి
స్వార్థమెఱుఁగమి ప్రేమకుఁ సహజగుణము!

ఆమె నాతోడ మఱియును బల్కిన దేమనిన,

తే. గీ॥ కృష్ణపక్షమునఁ జకోర మేవిధంబ
మెలఁగు; విజయసేనునిఁ జూడ వలయునంచు
నాత్మగతమున వాంఛించి, యధికతర వి
షాదమొంది, నిస్పృహఁజెంది, సగమునై తి!

మనోనాథుని, విజయసేనుని సందర్శనభాగ్య మొక్కసారి కలిగిం
పవే? యని వేడినది; నమస్కరించినది. తరుణమునకు వలయువారు
గదా, చెలిమివారు? (యోజించి) సుమిత్రుని సహాయమున,—
(చూడ్కుసారించి) అదిగో! సుమిత్రుఁడిటకే వచ్చుచున్నాఁడు. సంతో
షము!

(సుమిత్రుఁడు ప్రవేశించును)

రో—సుమిత్రా! కుశలంబా?

సు—రోహిణీ! విజయసేనుని సేవకులకాతని కుశలమే తమకుశలము.—
ప్రమద్వర సంతోషవతియేనా?

రో—మిత్రమా! ఆమెకు సంతోషమేడ? ఆమెవిజయసేనుని పలదినముల
నుండి చూచియుండలేదు. తత్కారణమున నాతఁ డెట్లున్నవాఁడో
యని భయముతోడి విచారమునఁ గరంబుకృశించినది. సేమ వచోవిలా

## ప్రమద్వార

సము మెఱయ నామె నెన్నియోసారు లనునయింపఁ బ్రయత్నింతును; విజయసేనునిఁ జూచినఁగాని యామెకు మనోశాంతి కలుగదు.

సు—రోహిణీ! విజయసేనుఁడు పూర్వమువలె గృహమునఁ గలవారందఱితోఁ గలిసిమెలిసి యుండఁగూడదు. ఇయ్యది పురీంద్రసేనుని యభిమతము. అయినను, విజయసేను నొకసారి యామె సమక్షమునకుఁ దోకొనివచ్చెదను. ఇందుకు వలయు ప్రయత్నములను జేసెదను; భయపడవలదని ముమ్మాటికి నామాటగా మీ చెలియకుఁ జెప్పుము. మఱల సాయంకాలమున నిన్నుఁ గలిసికొనియెదను.

(నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము

(ప్రదేశము. అరణ్యము. ప్రవేశము. విజయసేనుఁడు, ప్రమద్వార)

సే—ప్రమద్వారా! నీ మనోగతము నుండి నన్ను దూరము సేయుము. నీవిట్లు విచారించుట సరియగునది కాదు.

సీ॥ వేడికన్నీళ్లను విడచు కారణమునఁ
గనుదమ్ములక్కట! కెంపునువహించె
దీర్ఘనిశ్వాసముల్ తెఱపి నెఱుంగమి
లలితేందువదనంబు తెలుపు వడసె
ప్రమదావనంబున భ్రమణంబు మానుట
పంచాస్య మధ్యంబు బలముఁ దొలఁగె
కడుపార నాహార కాంక్షదూరము సేయ

విలసితాంగము జీవ కళఁదాలంగె

తే. గీ॥ నన్నుఁ బ్రేమించి నీవొందుచున్న సుఖము
గన్నులకు విశదంబు; నేనెన్న నేల?
మేలుకొనుమింక, జాలము మేలుకాదు
తరుణి! చంద్రుఁడు భూమినిఁ దాఁకునొక్కొ?

నాయందునీకు నిండారు మనోనురాగమున్నయది; గాని నేనందు లకుఁదగను. కాంతా! ఎట్టివారికిని ప్రమాదము గలుగకమానదు. విజయసేనుని తొందరపడి ప్రోత్సహించితివి. నీ శ్రేయమును మనోవాక్కాయకర్మలఁ గోరువాఁడనగుట, నన్నుమఱువుమని నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

ప్ర—విజయసేనా! (సవిచారముగా)

ఆ॥ వె॥ వస్తు లోకమునకుఁ బడయు వారలకును
నడుమునిలచి వారి నెడముసేయుఁ
గాలమెంత కఠినురాలో! దుష్టాత్మయో!
నేను నీదుదాన నైనఁగాను!

వి. సే—నాపలుకాలింపవుకదా! హేమపాలుఁడు ధనపతి; విశేషించి నిన్నుఁ బ్రేమించువాఁడు నావృత్తాంతమాద్యంతము నీవెఱుంగుదువు కదా! బుద్ధిఁదలపోయుము.

ప్ర—పురుషాగ్రణీ!

కం॥ మనమున జననంబొందును
మనమున వర్థిల్లు ప్రేమ మరియాద గనుకా
మనము గనుంగొను దూరము;
మనుజుని తెలివెంతయేని మందముగాదే?

వి. సే—హృదయమునను దూఁగదృష్టికలదు; గాని సమయ సముచితవ తెఱుంగవలయునుగదా?

ప్ర—విజయసేనా! ప్రేమ భయ మెఱుంగదు.

వి. సే—అట్లయిన, విజయసేనుఁడేనా నీమనోనాథుఁడు?

ప్ర—మనోసాక్షిగ!

(ఒడిలో పూవులు క్రిందఁబడుచుండ సంభ్రమకలితయై రోహిణి ప్రవేశించును)

రో—సుసేనుఁడు! సుసేనుఁడు!—

(ప్రమద్వర మందహాసవిలసితయై చూచుచుండును. విజయసేనుఁడు శాంతమతియై నిలువఁబడును.— హయంబునుండి క్రిందకుదుముకి కోపఘూర్ణితుఁడై సుసేనుఁడు ప్రవేశించును)

సు—　　భుజంగప్రయాతము

దురాత్ముండవో, ధర్మదూరుండవో, దు
ష్ట రక్షోకులంబందు జన్మించినావో
పరాకింత లేదా? యిభావంబుగాదా?
సరోజాక్షితో నేమి సంభాషణంబో?

తే॥ గీ॥ కన్నుఁగవ నెత్తికెక్కెనా? తిన్నతిండి
యరుగదా? ఊసుపోవదా? తరుణి మాట
గాని యొండొకని పలుకు కర్ణములకుఁ
గష్టతరముగఁ దోఁచునా? కఠినహృదయ!

ఓరీ! సిగ్గుమాలినవాఁడా! పరువుగోల్పడినవాఁడా! ఎన్నిసారులు నీకుఁజెప్పితిని; చెప్పించితిని; వలదుసుమా? ప్రమద్వరతోడ సంభాషణము. ఛీ! అభిమానధనుఁడవేని, నీపితరుణమున, నీరహాస్య యరణ్య

ప్రదేశమున, సుకుమారియు, వివాహయోగ్యయు నగు కన్యామణితో మాటాడ సాహసింతువా? నీచకులోద్భవా! పరులయింటఁ దలదాచుకొని, పరులకూటి కాశించు నీవా ప్రమద్వరను బరిణయ మాడఁగలవాఁడవు? ఆగోలబేలవై నీతోఁ జనువిచ్చి మాటాడుకతమున నీవిట్టి దురుద్దేశములను మనంబునఁ గల్పించుకొంటివి. నీచా! నాయందు నీకుఁగల భావమెట్టిది? 'తమ్ముఁడా!' యని పిలుచువాఁడవు! తమ్ముఁడు బావ యెట్లగును? తమ్ముని సోదరి నీకు సోదరి కాదటరా? మూఢాత్మా! లోకము వారి వార్త నెఱుంగుదు లేని, నాన బెట్టరే? ఛీ! యనరే? అప్పగారి గౌరవము కడముట్టనశింపదే? సుసేనుని యభిమానము నీ వెఱుంగవా? నీ మాటకేమి? అపకీర్తి కొడిగట్టితివి! మదాంధా! హేమపాలుఁ డిదివఱకే నీయందత్యంతాగ్రహ మూనియున్నాఁడు; గృహమునుండి నిన్నుఁ దొలఁగింపవలయునని సూచించెను. ఆతఁ డిప్పటి నీవర్తనమెఱింగిన నిన్నుఁ బ్రాణముతో విడచునా? వాచాటా! నీవు నాకోపాగ్నిం బడితివి; దగ్ధము గాకుందువే? (కత్తి నెత్తును; విజయసేనుఁడు శాంతభావము సూచించును)—రోహిణీ! దురాత్మురాలా! మేకవన్నె పులివి! ఏమియు నెఱుంగనిదానివలెఁ గానఁబడుదువు. అబ్బా! ముద్దురాలవు!—ప్రమద్వరా! ఏమి గ్రహచారమే? మాకుల గౌరవముఁ జెఱుపఁ బుట్టితివి! మాననీయుఁడగు పురీంద్రసేనుని గర్భమునఁ బుట్టక కసాయివానికడుపునఁ బుట్టిన నెంత బాగుండును? నిన్నుఁ గూర్చి దుఃఖింపనా? కోపగింపనా? ఈవాడివాలున నీశిరంబు దెగ నేసిన నందఱును సుఖింతురుగదా?—రోహిణీ! మాటాడకుము. దీనిని తీసికొనిపోయి యంతఃపురమున నిర్బంధింపుము. అప్పగారి యనుమతి యెట్లు మెలఁగవలయునో, గ్రహించెదను.

ప్ర—సుసేనా! కోపాంధుఁడవై విజయసేనునితో యుద్ధమునకు సిద్ధపడకుము. ప్రజ్వలితకీలలతో నాఁటలాడు వేమరుఁడుందునా? (రోహి

జీతో కొంతదూరమునడచి, వెనుదిరిగిచూచును. సుసేనుఁడు కత్తి
(త్రిప్పుచుండును. విజయసేనుఁ డొరవిూద చేయివేయును)
డా—ప్రమద్వరా! రమ్ము! రమ్ము! కొదమసింగములు కదనమునకు మొ
ఱడినవి. అప్పగారికిఁ జెప్పవలయును. (వడి వడి నిష్క్రమింతురు)
(తెర పడును)

---

# తృతీయరంగము



(ప్రదేశము. హేముని సౌధద్వారము. రక్తసిక్తములగు దుస్తులతో,
వికలమనస్కుఁడై, విజయసేనుఁడు ప్రవేశించును)

ద్వా. పా—(భయంబుసూచించి) బాబూ! ఈరక్తమేమిటి?

(వి. సే. జవాబుచెప్పకయే లోనికరిగి, దుస్తులు మార్చి యాసనాసీనుఁడై)
హా! మోహమా! నీబలమత్యధికము! అనివారితము! నన్ను మోస
పుచ్చితివి; ఇంకనుతృప్తి లేదా? —ప్రమద్వర. తనమనోగత మెఱింగిం
చెనుగదా? త్రికరణశుద్ధిగ ప్రేమదృష్టి నన్నామె చూచుచున్నదనుటకు
నామనోగతమే నిదర్శనము. ఆవిమలచారిత్రను జూచునపుడేమి, యా
లించునపుడేమి, హృదయమున ననిర్వాచ్యమగు మహానందమొకటి జ
నించెడిని. ఆహా!

సీ. పదమల్ల గుణమణి వదనమూరక యోరఁ
జేయ ఝల్లని గుండె చెదరి పోవు
వనజాక్షి ప్రణయ కోపముఁ జూపువేళ నా
కాశము బైవడ్డ కరణిఁ దోఁచు
సంపూర్ణ శశిముఖి చలమొకింత వహింపఁ

ప్రాణము పోయిన భాతి తోఁచు
తను లతాంగిని యొక్క క్షణము బాసితి నేని
విలయ కాలము వచ్చు విధము దోఁచు

తే॥ గీ॥ తరుణి హాస్యార్థమై విన్నఁదనము జూపి
పలుకమానిన యపుడు దుర్వారమైన
తల్లడంబును మై సొమ్మసిల్లుటయును
గలుగు; నామె నెట్లు మఱువఁ గలుగువాఁడ

(యోజించి) నాకాలలనాశిరోమణిపైఁ బ్రేమయుండినను డుఁగాక నే నేల మూర్ఖచిత్తుఁడనై యానాఁడామెను నామనోగతమెఱింగించితిని! ఎఱింగింపక నేనుండఁ గలుగుదునా? హృదంతరాళమామెకెన్నఁ డెఱుంగఁ జెప్పువాఁడనని నిమిషమొక యుగముగాబుచ్చి నిద్రాహారములకు దూరమై యెట్లు కృశించితిని? సమయము లభింపఁ జెప్పితినిపో, యేమిసంతోషము? తొందరపాటు వహించితినని వగంగుందుచున్నవాఁడను. ఆహా! ఇది కదా మనోహరమగుబాధ! — నేఁడేల తిరుగ యట్టి సంభాషణమున కాప్రదేశమున నే సమ్మతించితిని? ఆమె వాక్సరణి యామెహృదయము నెఱింగించెను గదా? ఆమెకరగ్రహణభాగ్యలాభము నమ్ముట కలలోనివార్తను నమ్ముట! — అయినను,

తే॥ గీ॥ ప్రేమ యను దీపకళికచే హృదయ సీమ
కాంతిమంత మొనర్చని కఠినుకంటె
ప్రేమఁ గొని, పొందనేరని విమలశీలుఁ
డధిక తరమన నిశ్చయం బగును గాదె?

(మోమెత్తి నిట్టూర్పువిడచి) సుసేనుఁడు మాయిరువురిసంభాషణ మెఱింగి మండిపడియెను. నన్ననరానిమాటలాడెను. అవును! —

తే॥ గీ॥ కులము భావింపలేను; సంకోచము గద
తల్లిదండ్రు లెవరో? ప్రమద్వర సహోద
రి సమకద? యామె యందునఁ బ్రేమఁ గొనిన
పరమ పాతకునకు గాదె పరిభవంబు?

నిశ్చయము, నాయదిఘోరబోటు; దీన నగుబా టగుట యాశ్చర్య మెుకో? దుర్నిరీక్షంబగు సూర్యమండలమును తదేకధ్యానమునఁ జూచువాని కన్ను లంధత్వము వహింపవే? సుసేనుఁడు నాకుహితబోధకుఁ డాయెను. ఆతని పథ్యవాక్యము లనుసరణీయములు.— అకటా! నేను నిజముగా దోసకారిని!

తే॥ గీ॥ తండ్రిఁ బోల్చు పురందరునిఁ దలఁపనైతి
హితుని సోదరుని సుసేను నెన్ననైతి;
పూవుఁ బోణిఁ బ్రమద్వరఁ బోల్పనైతి;
నిజము! నావంటి వాని కీనింద తగును!

సుసేనుఁ డీవార్త యప్పగారి కెఱింగించియుండును. ఆతఁ డెంత కటకటపడునో? నన్నెంతదూలనాడునో? కృతఘ్నుండనగు నన్నాతఁడు మన్నించునా? అయ్యో! నాయపరాధము మన్నింపదగినదా?—(యోజించి) ఏమిది?

తే॥ గీ॥ అతివ కరమును బొందంగ నాశ పడుట
కష్ట నిష్ఠురముల మార్గగమనమునకుఁ
బోనుట యటంచు నెఱుఁగక పోవలేదు
అయిన మానస మామెనే యభిలషించు?

(సుమిత్రుఁడు ప్రవేశించి, విజయసేనునిఁ జూచి, తనలో)

సీ. కరుణామృతముఁ జిమ్ము కన్నుదమ్ములతోడ
ముద్దు చంద్రునిఁ బోలు మోముతోడ
శరదిందు చంద్రికా దరహాసరుచితోడ
గంభీరమైన వక్షంబుతోడ
జానుపర్యంతంబుఁ జను బాహువులతోడ
మెఱుపుఁ దీగను నవ్వు మేనితోడ
వినుకెంపుఁ దలపించు మణిహారములతోడ
రమణీయమైన తురాయితోడ
ఆ॥ వె॥ చిలుక తేజి డిగ్గి తలిరాకుటమ్ములు
మఱచి యరుగుదెంచు మరునిఁ బోలి
చెక్కుఁ గరమాని చెదరకచూచుచు
విజయసేనుఁడు గను విందొనర్చు!

ఆహా! వీనింజూచినఁగదా, దృష్టఫలము గనినలాభముఁ గనినవారగుదురు! ఈతనివిధంబుఁ గనుఁగొన గాఢాలోచనాధీనుఁడైనటులఁ గానవచ్చెడిని. కటకటా! వీనికీదుర్వార్త నెట్లెఱింగింప నేర్తును?

తే॥ గీ॥ ఊర్మిడోలికలందున నూఁగులాఁడు
హంసరత్నంబు మేఘగర్జారవంబు
నాలకించి నెమ్మది దిగులందురీతి;
సలలితములగు సౌరభ్యములనుజిమ్ము
వికసితారవిందంబు తుషారవనమునఁ
జటులఝంఝానిలంబున సమయుమాడ్కి

లలిత లావణ్యచంపక లతకరంబు
వాడి భానుని కరముల వాడుభంగి
పొసఁగగును హృదయపుటభేదనంబు
తెలుపఁ గలనెట్లు కఠినంబు ములికివార్త?

పురేంద్రసేనుని తీవ్రానుజ్ఞ యిట్లున్నది! విధిగాఁ జెప్పవలయును.
(ముందుకుఁబోయి) — హా!

తే. గీ॥ గుండె తటతటయని వేగఁగొట్టుకొనెడు
దుర్భరంబగు కంపమావిర్భవించెఁ
బలుకు తడబడుచున్నది; భావమొకటి
యైనఁ బొడమదు; మాటాడఁ బూనుటెట్లు?

(వి. సేనుని సమీపించి) సజ్జనచూడారత్నమా! స్వాగతము!

సే— సుమిత్రా! వికాసముఁదొఱఁగి నీమోమట్లున్నదేమి? నీవెన్నఁడును విచారమనునది యెఱుంగవు. సదానందుఁడవని నేనమ్మితిని. నీ పవిత్రహృదయముకూడ విచారకీలావళి కాహుతియాయెనే?

— విజయసేనకుమారా! ముప్పదియేండ్లు దాటినవాఁడను. నేఁటిదనుక నేనెట్టివిచారమనునది మనోతలమునఁ జోటొసంగి యుండలేదు. నేఁటి నాయవస్థ—

సే—(అత్యాకాంక్షతో) ఏమీ! నీకుఁగలిగిన దురవస్థయెట్టిది? దానికారణమేమి? సత్వరము నాకెఱింగింపుము. నాప్రాణములు గోల్పడియైన నీభారముఁ దొలఁగించెదను.

— కుమారా! ప్రపంచమున మనుజుఁడు, తనకు దురవస్థ సంఘటిల్లినను తనతోడివారలు దుర్గతిఁ జెందినను వగఁగుందుట నిజము. ఇదినీ వెఱుంగనదికాదు.

వి. సే.—అవును. అదిమానవప్రకృతి; కాని తనయవస్థకంటె తన
వారిదురవస్థకుఁ గలుగువిచారమెన్నియో రెట్లధికము.

సు—నాయనా! నీయర్థము సూనృతముకాదని యనుభవశాలి యెవ్వఁ
డనఁగలఁడు? ఇప్పుడు నాహృదయము నాకొఱకై విచారింపలేదు.

వి. సే.—సుమిత్రా! నీవుసుమిత్రుఁడవు. నీచెలికాఁడెవఁడు దుర్దశ
నొందెను? నీజననీజనకులు, కడంగడు వృద్ధులు, సుఖమున్నవారే?
నీభార్య సుగుణరాసి, సతీరత్నము, కుశలమేకదా?

సు—(తనలో) అకటా! నాయందీతనికి నిరుపమానాభిమానము.
ఈతనికెట్లీ దారుణవార్త నెఱింగింపనేర్తును? (ప్రకాశముగా)
కుమారా! నాప్రియమిత్రుఁడొకఁడు నిష్కారణముగా నిందపాల
య్యెను!

వి. సే.—సుమిత్రా! ఆనిర్భాగ్యుఁడీ, విజయసేనుఁడని తెలిసికొంటిని. నీవు
విచారింపకుము. దైవోపహతుఁడనగు నానిమిత్తము నీవుకంటఁదడి
పెట్టకుము.—అప్పగారు నిన్నిటకుఁబంపిరా?

సు—అవును. ఆతనిసందేశమును గొనివచ్చితిని. భయంకర నిర్ఘాత
సదృశంబైనను జెప్పవలయును. నీవు తదనుగుణముగా వర్తింపవల
యును.

సీ. కాలయాపనసేయఁ గష్టతరంబైన
నోరులకంటఁ బడక యుండవలయు
బాణజాలముత్రుప్పు పట్టినప్పటికైన
నడవికి వేఁటాడ నరుగవలదు
జఠరాగ్ని బాధించి చంపుచుండిననైన
దినమున కొకసారి తినఁగవలయు
సుకుమారదేహంబు సొమ్మసిల్లిననైనఁ

[illegible]— ప్రమద్వర

గరితతలమున నిద్రఁ గాంచవలయు—

హా! విజయసేనా! పురీంద్రునకు నీయందిట్టి యాగ్రహము గలుగ నేల? మిత్రదర్శన మొనర్పక నిమిషమైన నిలువఁజాలవు; ఒంటరిగా నెట్లుండఁగలవు? వనమున భయంకరమృగ మొండు ప్రవేశించిన దని వినినయుత్తరక్షణమున నే బాణాసనమెక్కుపెట్టి, జ్యానాదము కర్ణపుటముల విందుసేయ, హయం బెక్కి చనువాఁడవు; మృగయా వ్యాపారములు దలంపక యెట్లుండఁగలవు? పంచభక్ష్య పరమాన్నములు సంతుష్టి భుజించువాఁడవు; దినమునకొక్కమారు భుజించి యెట్లుండఁగలవు? హంసతూలికాతల్పమున మేనుజేర్చి సుఖనిద్రఁ జెందువాఁడవు; కఠినప్రదేశముల నెట్లుశయనింపఁగలవు? కటకటా! విజయసేనా! ఇంతియకాదు. మఱియునొండు విశేషముగలదు. ఆలింపుము.

తే॥ గీ॥ నయనయుగము లేతన్వి సందర్శనమున
సంత సాంబు వృష్టిగురియు సంతతంబు
నా ప్రమద్వరను గలలోనైనఁ దలప
వలదు; కటకటా! యెంతయాపదఘటిల్లె?

వి. సే.— సుమిత్రా! నీవు కారణములేని విచారమునకు లోనైతివి. నీసందేశము నాకానందమే యొసంగినది! (ఆత్మగతమున)—

ఉ. హారముఁ గోరనేరను విహారము దూరము; హారముల్ మహా
భారములౌనుగాదె? సువిచారము నేరముగాను మారు; దు
ర్వార విచారకారణము ప్రాణము ధారణసేయుటారయన్
మారుని కేళమాయను ప్రమద్వరలేని సుధర్మయందునన్

పురీంద్రుని వాక్యపరిపాలనము సేయునెడ విచారమున సంతోష

కొందవలయును. (ప్రకాశముగా) సుమిత్రా! పురీంద్రసేనుని సందేశాను గుణముగ వర్తించెదనని చెప్పుము. ఆతఁడు వాడివాలున నన్ను వాలుపనెంచినను, సంతోష సమాకలితుఁడనై సన్నద్ధుఁడనయ్యెదనని చెప్పుము.

సు—కుమారా! నీకు నేనెట్టి యుపకారమును సేయఁజాలనా? చీఁకటి రాత్రములువచ్చినవి; వెన్నెలలు రాకమానునే? — నేఁబోయివచ్చెదను.—

వి. సే—(అవనత వదనుఁడై) మంచిది. అప్పుడప్పుడు నీవిచ్చటకు వచ్చుటకు వీలుండదుకదా?

సు—కృపాపరతంత్రుఁడగు పరమేశ్వరుఁడు నిజానిజము లెఱుంగును. నేనుసుమిత్రుఁడ నేని నీదర్శన మొనర్పక యొకదినమైన నుండఁగలనా?

తే. గీ॥ ఆయతమునఁ గ్రోసెడు; పొడుగందు బదియు
క్రోసులుగల భూధరమును గుట్టయనుచు
వారిరాసిని యొక సెలయేఱటంచుఁ
దలఁతు మిత్రునిఁ జేరంగ వలయునపుడు

వి. సే—నిన్ను నే నెఱుఁగనా? సుమిత్రా! నేనుండెదను.

సు—కుమారా! పోయివచ్చెదను—(కొంతదూరమునడచి, మగుడి వి. సేనుని సమీపించి) హా! విజయసేనా! నిందపాలైతివి సుమా! (కన్నీరుఁగార్చును. వి. సేనుఁడు. చేతిరుమాలున నాతనికన్నీరు దుడిచి)—

వి. సే—మిత్రమా! నాకై విచారింపకుము. నీవిట్లు దుఃఖింతువేని నేనెట్లు సంతోషము సూచింతును?

సు—కుమారా! సుసేనునివృత్తాంతము నీవెఱుంగుదువా?

వి. సే—(ఆశ్చర్యముతో) ఏమీ? ఆతఁడింకను గృహమునకే తేఁలే

సు——హా! పరలోకమున కరిగినవారు మఱల యెట్లువత్తురు?

వి. సే——ఆఁ! ఆఁ! ఏమనుచున్నావు! సుమిత్రా! నిక్కము వచిం

సుసేనుఁడు సజీవుఁడేకదా?

సు——కుమారా! నిక్కము చూప నేల? సుసేనకుమారుఁడు మృగ మఱిగి యెంతకును రాఁడయ్యె. వనపాలకుఁడొకఁడరుదెంచి, కరవాలమొకటి యొసంగి పురోహితునితో, "దేవా! ఈలోహ మొకనెత్తురు మడుఁగునందు దొరకినది." అని చెప్పి యొసం ఆఖండితకృపాణమునీయది. వనపాలుఁడు నిష్క్రమించిన కొంత వేళకొక యాటవికుఁ డరుదెంచి, సుసేనుని శిరోవేష్టనమును జూపి, "ఇదిమన వనోత్తరదిశఁ బారునదిలోఁ గొట్టుకొనిపోవుచుండఁ జ తెచ్చితిని." అని పురోహితుని ముంగలఁ బెట్టెను. తరువాత ద్వా లకుఁడేగుదెంచి, "దేవా! విజయసేనుఁడు రక్తసిక్తంబులగు దుస్తుఁ గృహప్రవేశమొనరించెను. "సంగతియేమి?" యనియడిగితిని; చె డయ్యెఁ; మాటాడలేదు!" అనిపలికెను. రోహిణీ ప్రమద్వరల న టయ్యు, నరణ్యమున నిన్న సుసేనుఁడు పరుషోక్తులనొప్పించుటాది గలవృత్తాంతమును జెప్పిరి. ఆతఁడు కత్తిఁ ద్రిప్పెనట! నీవార జేయినిడితివట.——అదిగాఁగల విషయావలోకనమున నీవు——

వి. సే——హా! సుమిత్రా! దుర్భరము! దారుణము! సుసేనుఁడు ధరణి లేఁడు! సజీవుఁడు! సజీవుఁడు!——నిర్దోషిని!——నాకు నిదురవ చ్చుచున్నది. శయ్యారచింపుము. (పడకగదివైపు పరుగెత్తును)

(తెర పడును)



# తురీయాంకము



(ప్రదేశము ఒకగది. ప్రవేశము. ప్రమద్వర, రోహిణీ విచారమనస్కలై)

ప్ర—రోహిణీ! నిజమేనా! అయ్యో!

చ॥ కరము మనోభిరామమున 'గాదిలిసోదరి!' యంచుబిల్చునే?
నరనిమిషంబు భోజనము సప్పుడు జాలము సేయఁడాన స
త్వరముగ నేగుదెంచు; వినుతంబగు బుద్ధి గఱించునన్ను; నే
త్తరఁగున నాను సేనుని మఱిందలపోయక నుందునక్కటా!

చెలియా! నామంగళముఁ గోరువాఁడే, నాయనుంగు సోదరుఁడు భూమినింక లేడా? నికృంబగు నే?—హా! అన్నయ్యా!

తే. గీ॥ ముద్దుచెలిఁగోన్న రీతి యేప్రొద్దు నన్నుఁ
బిలుచువాఁడవు మఱిసౌధ వీథులందుఁ,
బాసినాడవె భీకర వన్యసీమ
పాతకీ! యనిపిల్చి, కోపంబుక తన!

చెలీ! రోహిణీ! ఈమాట నేనమ్మఁజాలను.—ఏమో!

(అన్నను ద్దేశించి)—

ఆ. వె॥ విజయు శాంతగుణము వెలయంగతుదిదాఁక
మానధనుఁడ వాటఁ బ్రాణములను
చేతిహేతి భయద పాతంబుచేతను
గోలుపోయినావె! కూర్మియన్న!

హా! రోహిణీ! నా సహోదరుఁడు, నా యనుంగు సుసేనుఁడు, మర ణంబు నొందియుండునని నాకుఁదోఁచకున్నయది.— ఏమి!

ఆ. వె॥ కడిఁదిశరభ మృగనికాయమైనను, లేక
హరులుగాని, మత్త కరులుగాని
భయము నెఱుఁగఁడెదను; బాధించి చంపెనో?
కాలవశత నొందు కఠిన మృగము?

నా మనంబు పరిపరివిధములఁ బోవుచున్నది. సకియా! నీయుద్దేశ మేమి?

రో— చెలీ! నిక్కము దాపరాదు. ఎఱిఁగినయుదంత మాప్తులకుఁ జెప్పనిచోఁ బాపము దాపురించును.

ప్ర— నీమాటలు నాకించుక యాశ కలిగించుచున్నను, నీముఖవైఖరి దానిని పూర్వపక్షము సేయుచున్నది.

రో— అమ్మా! చెప్పితీరవలయును!

సీ. అసితోత్పలంబును నపహసింపఁగఁ జాలు
చక్కని నునుమేను చాయవాఁడు;
జయలక్ష్మికావాస స్థానమైయొప్పారు
రమణీయమైన యురంబువాఁడు;
ఎగు భుజంబులవాఁడు నగుమోము నందొకి
యింతకోపంబు భావించువాఁడు
భయ మెఱుంగనివాఁడు పటు పరాక్రమనిధి
నిశ్చితార్థంబును నిలుపువాఁడు

తే. గీ॥ కటకటా! సుసేనుఁడు ఘోర కాననమున

విలయ కాలమునాఁటి వేవెలుఁగు రీతి
బాధబెట్టి విజయుని దుర్భాషణముల,
నతని క్రూరాసి కెరయయ్యె నబ్జవదన!

ప్ర—హా! హా! హా! (మూర్ఛిల్లును. రోహిణి శైత్యోపచారవిధులు గావించును)

పు. సే (ప్రవేశించి)—కుమారీ! విచారింపకుము.—అమ్మా! లే! లే!

ప్ర—(లేచికూర్చుండి) అప్పగారూ! విజయసేనుఁడు హంతకుఁడు కాఁడు.

తే. గీ॥ పూఁచునే చంపకలతకు మోదుక సుమ
ము; గడ్డికను మేయునే సింహము; మధువువడ్డ
యునొకో చేఁదుగుణము; ధాత యోర్వలేక
చారుధవళతలమున లాంఛనము వెట్టె!

పు. సే—కుమారీ! నిజమెఱుంగుటకు వలయుసాధనములు లేకపోలేదు. విజయసేనుఁడు మానవుఁడు. మానవునకు సైజములగు కొన్నికొన్ని లోపములుండితీరును. దురాగ్రహంబున ముందు వెనుక లరయక, నా కుమారరత్నమును, నాకులార్ణవసుధాధాముని, నాసంతోషవర్ధనునిఁ జంపినాఁడు. అతనిని కఠినవిర్బంధన శిక్షపాలుగావించితిని; కాశ్మీర దేశాధీశ్వరున కీయుదంతమంతయును వ్రాసిపంపితిని. ఏదియెట్లు జరుగునో?

ప్ర—జనకా! తొందరపడవలదు. విజయసేనుఁడు మీకుక్రొత్తవాఁడు కాఁడు. ఆతనిగుణగణనము మీరెన్నిసారులుచేయలేదు. తలపోయుఁడు. నిజానిజము లెఱుంగుఁడు.

రో—ఆర్యా! కుసేనుఁడు నిజముగా మృతిబొందియుండునా? వనమంత యును వెదకింపుఁడు.

పు. సే—వెఱ్ఱిబాగులదానా! పగలు రాత్రియనిన నమ్మువా రెవరు?

(ఇంచుకయోజించి) కుమారీ! ప్రమద్వరా! హేమపాలుఁడు నీతోడ నేమిరో మాటాడునట! అతఁడిప్పుడే యిటసవచ్చును. నీవలంకృతవై యాతనిరాక నిరీక్షించుచుండుము.

(నిష్క్రమించును)

(యవనికజారును)

---

## పంచమరంగము

(ప్రదేశము. అరణ్యము. ప్రవేశము. వింతముసలిది)

హా! ఎన్నెన్ని మార్పులను జూచుచున్నాను. నిజము. నాయది కష్టపుబ్రతుకు! దైవమా!

కం॥ మఱియొక జన్మం బెత్తుట
స్థిరమా? యటులేని నీకు శిరమొగ్గెద, నా
పరితాపంబును దీర్పఁగఁ
గరుణాకర! యిట్టిజన్మ గరుణింపకుమా!

(యోజించి, తలయూచి, ముందునడచి, మీదఁజూచి) అబ్బా! మెఱుపులు, గర్జానినాదములు, మేఘమాలికలు, తెగపి నెఱుంగకున్నయవి! వర్షముధరగుండఁ గూల్చినట్లు గురియుచున్నది. అబ్బబ్బా!

తే. గీ. చింకిగుడ్డలు దాలిచి; శీతలపవ
మానుబాధకు వణఁకుచు; మేన వర్ష
ధారలు ప్రవహింప; నిలువనేరక, నిబి
డాంధకారమునఁ దిరుఁగు దశవియందు

(ఊహూ హూ హూ, అనివణకుచు, కొంతదూరమునడచి, ముందుచూచి)

తే. గీ॥ దుష్టలోకము మధ్య నుత్కృష్టుఁ డొకఁడు
గలుగునేని సత్కీర్తిని గాంచురీతి;
అల్లదే! తమోభరితమా యటవిసీమఁ
గానఁబడు దీపరేఖ ప్రకాశముగను!

అటకుఁబోయెదను. ఈరాత్రి యచ్చోటున విశ్రమించెదను. (ముందడుగిడి) అబ్బా! పాదములు వణఁకుచున్నవి. (స్థైర్యమవలంబించి)

తే. గీ॥ పెళపెళ విఱిగినను మిన్ను విఱుగుగాక!
అవనిపాతాళ మంటిన నంటుగాక!
ప్రాణములు నాదు కంఠంబుఁ బాయుదాక
విడతునే శపథంబు దుర్వినయగతిని

(పుళిందుని సౌధమునుసమీపించి) ఇది వనరాజు పుళిందుని సౌధరాజము. ఆహా!

ఆ. వె॥ ధ్వజము గానఁబడదు, దాని టపటప ధ్వ
ని వినవచ్చుచున్నది విశదముగ;
నాకసంబునంటు ప్రాకారవిలసిత
హర్మ్యరాజ మిట్టిదవనిఁ గలదె?

దౌవారికుఁడు—ఎవరు! ఎవరు!

విం.ము—ఓయీ! మీరాజుతో నిట్లు చెప్పుము.

తే. గీ॥ దిక్కులేనిది; యబల యర్థి; పరగాదు;
తిండి మెఱుఁగదుస్వామి కొన్ని దినములయ్యె

నేఁటి చలిబాధ సైరించి నిలువలేక
నీదుశరణంబు గోరెను నృపకుమార!

అని చెప్పిన యనంతరం బాతని యభిమతము శీఘ్రింబ నాకెఱిఁగింపుము.

దౌ—పో! పో! ఇప్పుడు నేను చెప్పలేను.

విం.ము—ఏమీ! ఈపొగరుబోతుతనము! ఓరీ! నన్ను దిరస్కరింతువేని మీరాయేలికతో నీపోమరితనం బెఱింగించి, నీకూటిలో మన్నుపోయించుదును. జాగ్రత్త!

దౌ—(భయముతో) అమ్మా! నీవువనదేవతవో! లేక మరెవ్వరో! నీసందేశమేమి?

విం.ము—(దిక్కులేనిది; అనుపద్యము మఱలచదువును)

(దౌ. లోనికరుగును)

విం.ము—(ఆత్మగతమున)

తే. గీ॥ ఏమి! శుభసూచకంబొ? కాదేమొ? దుర్భ
రంబగు నలజడియగునొ? వ్రాతయెట్టు
లున్నదో కాని, యుత్సాహ ముద్భవిల్లి
పొంగిపొరలెడు తరఁగల్ల పోల్కి నెదను

(దౌ. ప్రవేశించి) అమ్మా! లోనికి. (దారిచూపును. కళింగుఁడెదురేగుదెంచి) సోదరీ! నీసందేశము మాకు జాలికలిగించినది. నీయిష్టము వచ్చినన్ని దినములు మాగృహమున నుండవచ్చును.

విం.ము—సోదరా! నీహృదయము పవిత్రవంతమైనది. నన్నింకను బోల్చుకొనలేదా?

క—(స్మృతినభినయించి) ఔనౌను! ఎఱింగితిని. నాఁడు వనమధ్యంబున, పురేంద్రసేనుని యాతని పరివారమును సంకులసమరం బొనర్చి

గీటడంచు వేళ, నీవకా యరుదెంచి, ప్రమద్వర యూనికి సురక్షితమని ధైర్యమొసంగితివి. సోదరీ! నీయుపకారము నేనెన్నటికిని మఱువను. చినిఁగిపోయిన యీదుస్తులు నీకుదగవు. చాలదినములనుండి భోజనము లేదట! పాపము! కరంబుడస్సి యున్నదానవు. రమ్ము. (దాని చూపును నిష్క్రమింతురు)

---

## షష్ఠమరంగము



(ప్రదేశము. ఒకవసారా. ప్రవేశము. వింత. ముసలిది)

భోజనమైనది. సమయము మధ్యరాత్రము. నిద్రింతునా?— సౌఖ్యమనుభవింప నేఁబుట్టలేదు. ఏనాఁడాఘోరంతము జరిగినదో, యేనాఁడు మానవుఁడు రాక్షసుడాయెనో, యేవిషమ దినంబుననుండి నేఁటిదనుక నిరంతరముగ పాపమే విజృంభించుచున్నదో, యా దినమునుండి సుఖములన్నిఁటికి నొక్క నమస్కార మొనరించితిని. అదిగో! ఆగదిలో నెవ్వరో మాటాడుచున్నారు; వారినాలించెదను. (పరిక్రమించి, వినుట నభినయించును)

(నేపథ్యమున)

తమ్ముఁడా! నేఁడే యామెను మనము దీసికొనిరావలయును.

విం. ము—ఎవరిని చెపుమా?—ఔను! ప్రమద్వర నేకి 'వినాశకాలే విపరీతబుద్ధిః'

(మఱల నేపథ్యమున)

పరిహారము సిద్ధముగనే యున్నది. మఱియొక యరగంటలో బయలుదేరుదము.

విం. ము—(పరిక్రమించి) సరియే. వీరియుద్దేశము బోధపడినది. ఆమెను

వీరు బలత్కారముగా నిటకు దోకొనివచ్చినను, నేనిచ్చటనుండు వంతదనుక, వీరామె నేమియుఁజేయఁజాలరు. ఇదెనిశ్చయము. అదిగో! అది పాకశాల. ఎవరో భాషించుచున్నారు. ఆలించెదను. (పాకశాలను సమీపించును. వినుట నభినయించును)

(నేపథ్యమున)

ఒకఁడు—ఒరే! మాలీ! ఈ పందిచర్మ మెంతగట్టిదిరా? మఱచితిని. సాయంకాలము మసాలా తెప్పించితివా?

మఱియొకఁడు—ఒరే! వెంకా! అన్నియుసిద్ధముగానున్నవి. దానిగొంతుకలో నల్లగానున్నది. అదేమిరా?

వేఱొకఁడు—ఎవఁడో వెఱ్ఱివాఁడు వేఁటాడినాడురా? ఇదియొక కత్తిముక్కరా? (పైకివిసరును)

విం.ము—(ఆఖడ్గఖండమును గైకొని, పరిశీలించి చూచి) దీనియుపయోగము ముందు ముందుఁ దెలియఁగలదు. ఓ ఖడ్గఖండమా!

తే. గీ॥ వారినిధి మధ్యమందున వసవవాఁడు
కాలయాపమునకు సుఖతరమైన
పాఁటపాడును గాని, తాఁబడయనెంచి
రత్ననిధులకుఁ జేయునే యత్నములను?

(దానిని సంచిలో నిడికొని, యతుగులచప్పుడాలించి) ఎవరో వచ్చుచున్నట్లున్నది. పుళిందకళింగులు పురేందుని గృహమునకుఁ బ్రయాణమైనతరువాత యీసౌధమంతయును బరీక్షించి చూచెదను. ఎన్నెన్నివింతలు బయలుపడునో!

(నిష్క్రమించును)







# ప్రమద్వర

## పంచమాంకము



### ప్రథమరంగము

(ప్రదేశము. ఒకగది. ప్రవేశము. విజయసేనుఁడు విచారగ్రస్తుఁడై)

హా! సుసేనకుమారా!

చ॥ కలకలలాడు నీముఖముఁ గాంచెడుభాగ్యము నాకు లేదె? ము
ద్దులొలుకు నీసుధామధురతుల్యములైన ప్రమోదభాషణం
బులు చెవులార నేవినఁగఁ బోలనె? నాపయిఁ గోపగించితో?
చెలిమిదలంపవా? తగునె? చిన్నతనంబునుగూర్పఁ దమ్ముఁడా!

కటకటా! లోకము నన్ను హంతకునిగా నమ్మినది.

తే. గీ॥ కులగిరులను భుజములపై నిలువఁబెట్టి
భారమైనను మోసెద పాటుపడుచుఁ
గాని, తమ్మునిఁ జంపిన కఠినహృదయుఁ
డీతఁడను నింద నేను సైరింపఁజాల!

సోదరా! సుసేనా! నాఘాటకేమి! విజయసేనున కెన్నఁడును సౌఖ్యములేదు. వాని విచారము లోకమున కానందకారణము, నీవు చిరంజీవివై యుండువేని లోకదియు ప్రమోదము.

తే. గీ॥ ఒకదినంబున ముల్తాను నికటభూమి
మీఁద హయములపై నెక్కి మేరమీరి
పోవునప్పుడు, ' విజయా! నభోంగణమున
కట్టులే పోదమొకసారి యెఱుఁగుమిదియ '

అని దరహాసాంకుర విలసితాననుండవై పలికితివి. నీవిప్పుడు లోక మునమ్మినటుల పరలోకమున కఱిగినను, కటకటా!

తే. గీ॥ మొండివాఁడను; కఠినుఁడ; మూఢమతిని;
సోదరుని సంహరించిన క్షుద్రుఁడ నేఁడు
మేనుమోచిన షాఁడ; నీతీరెఱింగి
తనువులోపలఁ బ్రాణాలు దాల్తునింక!

(అడుగులచప్పుడాలించి) ఆ వచ్చువారెవరు?

(నేపథ్యమున)

మిత్రమా! నేను హేమపాలుఁడను. నాయాగమనము నీకాశ్చర్య కారణమే యైనను, నీశ్రేయమాగసి వచ్చుటవలన నీవు నన్నాలింతు వను నమ్మకమున్నది.

వి. నే.—సునేనుని వృత్తాంత మాద్యంతము నానుండియెఱుంగఁ గొంతు వేని, నేధన్యుఁడనయ్యెదను; దైవము నిన్నురక్షించును.

(నేపథ్యమున)

చాలసేపు మాటాడుటకు సమయము లేదు. నేను న్యాయాధికారిని గాను; నీస్నేహితుఁడను. నేనిటకు నాపనిమీఁదవచ్చుటలేదు. నీక త్యంత మిష్టమైనవారి సందేశమున్ గొనివచ్చితివి.

వి. నే.—ఆర్యా! లోనికిరండు. (హేమపాలుఁడు ప్రవేశించును)

ఆ యాసనమధిష్ఠింపుఁడు. (హే. షా. కూర్చుండును)

హే. పా—సందేశహరులు కాలయాపనము సేయరాదు.

వి. సే—ప్రమద్వర పంపినవార్తయెట్టిది. ఆమెయైన నన్ను నిర్దోషిగా భావించునా?

హే. పా—(మిన్నకుండును. విజయసేనుని ముఖలక్షణమును బరీక్షించును)

వి. సే—ఏమి! హేమపాలా!

కం॥ సకలావస్థల నెవత్తెను
త్రికరణములు సాక్షిగాఁగ తెలియుదునో, యా
వికసితజలరుహాలోచన
యకలుష మతిగాఁదలంచునా నను? చెపుమా?

హే. పా—విజయసేనా!

ఆ. వె॥ వేయునేల? పలుకు వినుమొక్కటే చాలు
సరళమైనఁ బరుషతరమయైన
నీదు శ్రేయమరసి నీరేజపత్రాక్షి
వ్రాసి యుత్తరంబు బంపె నిదిగో!

(జాబిచ్చును)

వి. సే—(అందుకొని ససంభ్రమముగా)

తే. గీ॥ జలకణంబుల కాశించు చాతకంబు
జలధరంబులఁ గాంచిన సంతసించు
కరణి; యామెను గనులారఁ గనకయున్న
నామె వ్రాలైనఁ గని మోద మందువాఁడ

(చదువును)

"విజయసేనా!

దైవము మనయెడ ననుకూలుఁడు గాడయ్యె. నీవిప్పుడు దారుణా

వస్థలో నున్నవాఁడవు. హేమపాలుని యుద్దేశానుక్రమముగా నీవొన రింపవలయును. ఆతఁడు నిన్ను సురక్షితస్థలమునకు దారిజూపును. సత్వరముగ బయలుదేఱిపొమ్ము. ఇది మదీయప్రార్థన. గ్రహింపుము.

ప్రమద్వర ౹౹

హా! ప్రమద్వరా! హా! ప్రమద్వరా! విజయసేనుఁడు దోషి యని నమ్మితివా? ముద్దుకుమారుని, సుసేనుని జంపినపాతకి యని నమ్మితివా నాగుణముఁ నీకుఁ గొత్తయా? అయ్యో! నేజీవించి యేమి ప్రయోజనము! — హా! హేమపాలా! ప్రమద్వరను జూచెదను. మిత్రుఁడనని నాగదిలో నడుగు బెట్టితివి. నాయభిమతమును దీర్పుము. నేనామెను దప్పక చూడవలయును.

హే. హ— విజయసేనా! అది వలనుపడదు! శాంతించు. శాంతించు!

వి. సే— శాంతమా!

ఆ. వె॥ గాలి ప్రోత్సహింప గంభీరనాదంబు
జేసి దిశలనెల్లఁ జెవుడుపఱచు
సాగరంబుఁజేరి శాంతించు, శాంతించు
మనుచుఁ బల్క నెడల నగునె ఫలము?

నేనామెను తప్పక చూడవలయును. నీ వీయుపకృతి సేయఁ జాలవా?

హే. పా— విజయసేనా! నీకు వెఱ్ఱియాయేమి? నీశ్రేయమారసి, పురీంద్రసేనునకుఁ దెలియకుండ యిటకరుదెంచితిని. నీతో మాటలాడిన నెంతయో చేటుగలుగు. నిజానిజము లెఱుంగను; గాని యెల్లరు చెప్పుకొనునది యేమన, సుసేనుని వనీతలమున నీవ సంహరించితివట! హంతకునితో మంతనము కీడు! తెలిసినదా?

సే— హేమపాలా!

తే. గీ॥ జగమునందున సంతోష సరణులందు
సకియ ప్రణయజనిత సంతసంబు నిర్మ
లంబు, నిత్యంబు; సర్వ కాలంబులందుఁ
బెఱుఁగుఁగాని, విఱుగదు; భూవరకుమార!

కాని వాఙ్మానసక్రియల నొక్కతెనమ్ముకొని, యామె నే భావించు వానిం గని వేల్పులోర్వలేక, నిష్కారణముగ నామె మనోగతమున నభావముఁ గల్పించు నాఁడాతనికీజగముతోడి దేమియు నుండఁబోదు.

తే. గీ॥ తన మనోకాంత నిశ్చలత్వమును బూని
కాంచువేళల ప్రేమ సుఖతర మన్య
మైన మరణమే మధురము; గాన నేను
చక్షువులు మూయువాఁడను సత్వరముగ

హే. పా— (ఆత్మగతమున)

తే. గీ॥ మానసిక దుఃఖ మాననమండలమునఁ
గలుగ; నున్నతమైన వక్షస్థలంబు
పైని ముద్దుమోమును వాల్చి వసుధఁజూచు
వీనిచిత్తరువును వ్రాయు వానిపేరు
కలఁగు జెలఁగు స్థితులమధ్య నిలచుఁగాదె?

(ప్రకాశముగా)— విజయసేనా!

తే. గీ॥ రమ్ము! దుస్తులు దాల్పుము; రయమున నొక
మాటలేక నీ మెచ్చు ప్రమద్వర యుప
దేశమనుసరించి బతుకు దేరుమిా? యు
సురులు నిల్పు; లేనియెడల దురితమౌను!

వి. సే—ఏమీ! పాఱిపోవుటయా! హేమపాలా! పురీంద్రసేనునియాజ్ఞ
నీవు వినలేదా? అదియెంత తీవ్రమైనది! తదీయాజ్ఞోల్లంఘనము సేయ
మనం బంగీకరింపకున్నది! అదియునుంగాక,

ఆ. వె॥ అర్ధరాత్రమందు నభిమానమును వీటి
బుచ్చి, కారణంబు పొరయకుండ
పారిపోయినయెడ బాలును సేనునిఁ
జంపినటుల నన్ను జగము దలఁచు

నేను పోవఁజాలను! హేమపాలా! తొందరపెట్టకుము.

హే. పా—అటులేని, ప్రమద్వర పలుకు నదరింపవా? ఆమె కల్లితింగింతునా?

వి. సే—ఆర్యా! అట్లు చెప్పవలదు.—అట్లు చెప్పవలదు.

హే. పా—విజయసేనా! నీయందు పురీంద్రసేనాదులకుఁగల యనుమానముల నిజానిజములతో నాకుఁబని యేమియును లేదు. ప్రమద్వర యుత్తరమువలన నీవీసౌధమును వీడ్కొలిపిన నామె సౌఖ్యవతిగానుండునని నాకుఁదోఁచెడిని. నిక్కువంబంతియ. నీయిప్పటి మనోగతమామె కెఱింగింతునేని, యామెకు మతిభ్రమణము గలిగెడిని.—బహుశః మరణించునని తోఁచుచున్నది. ఇది నీకు సంతోషమా?

వి. సే—హా! హా! ఆమెమృతిఁ బొందుట నాకానందమా!

ఆ. వె॥ చూఱికత్తినగ్నిఁ గాఱచుఱఁ గాల్పించి
బలము మెఱయ హృదయ భాగమందుఁ
జనఁగలోఁతుగా ఖసక్కునఁబొడిచిన
సంతసంబు గలుగఁ జాలునొక్కొ?

హే. పా—అటులేని, నీవీమందిరమును వీడ్కొల్పుము. ఒకవేళ నీవిచ్చటనే యుండువేని, సుసేనునిఁ జంపితీవని నేరము సిరపడును. నిన్నురితీయుదురు. నీదారుణమరణము ప్రమద్వరను జంపివేయును. నీచ

ముగాఁ జచ్చుటకంటె, సన్మార్గమున మరణించుట సర్వజనజేగీయ మానము! పాహిమాం! పాహిమాం! అని ప్రమద్వర నాలోఁ బ్రతిధ్వనించుచున్నది. నీవాలించుచున్నావా?

వి. సే—(కరములుజోడించి, కన్నులుమూసి)

చ॥ కనులకుఁగానరాక మముఁగావఁగనున్న సురేంద్రులార! నా
మనము వచించు మీరరసి మన్ననసేయుఁడి పాపమేని, నా
యునికి కతంబునన్ చెడుగులొందును నాప్రియకాంత,యాసుసే
నుని వధియించినాఁడనని నోటికి వచ్చినరీతి నన్ను దూ
షణలొనరింప నీజగము? చారులు నట్టె దెగవేయనీ? పురీం
ద్రుని హృదయాంతరాళమును రోషభయంకరవహ్ని గా
ల్చినను; మదీయమానసముఁ జేరి సతంబు వసింపనెంచు సా
ధ్విని ముదమొందఁజేయఁగడు వేగము పోయెద నాలకింపుడా

హేమపాలా! దారిచూపుము.

హే.పా—రమ్ము! బైట హయంబాయత్తము. నా సేవకుల నిరువుర నీవెంట కొంతదూరము పంపెదను. దైవము నీకు మేలు గూర్చుగాక!

(నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము



(ప్రదేశము. ఒకచావడి. ప్రవేశము; సుమిత్రుఁడు)

పాపము! విజయసేనునియవస్థ కడుంగడు విచారకరము. ఏకారణమునో నిర్బంధమునుండి తప్పించుకొనియె. దురాత్ములు పులింద

కళింగులు ప్రమద్వరను బలాత్కారముగాఁ గొనిపోవుచుండ వారలనొంచి యామెను విడిపించెను. పురీంద్రుఁడు కుమారికను రక్షించినందుల కాతనికిఁ గృతజ్ఞతాపూర్వకములగు నాశీర్వచనములు చేసి, పుత్రఘాతకుఁడని నమ్మి దూషింపకుండినను, మరల కఠిన కారాగారమున నుంచుఁడని భటుల కాజ్ఞయిచ్చెను. హేమపాలుఁడు కపటాచరణ ధురీణునివలెఁ గన్పట్టుచున్నాఁడు విజయసేనుఁడు దోషియగుట దండన తప్పించుకొన నెంచి పాఱిపోయినటులను, తనవారలిరువు రాతనిని వెంబడించినటులను, వారల నాతఁడు వధించినటులను పురీంద్రున కెఱింగించెను. ఇందు నిజమెంతకలదో? అట్లు చెప్పినను, విజయుఁడు హంతకుఁడు గాఁడు. అట్టికరుణామతి, ధర్మప్రియుఁడు, సత్యనిరతుఁడు ముల్లోకముల లేఁడు. అయినను, వానిపై నిందపడినది. ఇదికదా లోకధర్మము! నేను సుమిత్రుఁడ నేని, విజయునిఁ గాపాడితీరెదను! (ముందుచూచి) విజయసేనుని దర్శించి, కొన్ని సంగతులు ముచ్చటింపవలయును.

(నిష్క్రమించును)

---

# తృతీయరంగము

ప్రదేశము. కారాగృహము.

(ప్రవేశము. విజయసేనుఁడు; పురీంద్రసేనుఁడు)

సే.—కుమారా! నీకథను వచింపుము. రోహిణీ ప్రమద్వరల వాక్యములు మృషలా! అరణ్యప్రదేశమున సుసేనుఁడు కరవాలము ఝళిపించుచు, నిన్నుఁ బరుషోక్తుల నొప్పించి, కయ్యమునకుఁ గాలుద్రవ్వె

నట. నీవు కోపారుణితలోచనుండవై యొరపైఁ గరమిడితివట! క్రూర భుజంగమును దలఁపించు నీకరవాలమున వానిశిరము నఱికితివా?

వి. సే.— తండ్రీ! విజయుఁడు మీకు క్రొత్తవాఁడు కాడు. సుసేనుఁడు కానరామి మీ రెంత విలపించుచున్నారో, యంత కెన్నియో రెట్లధికము నేను దుఃఖించుచున్నాను. హా! పాపకాలము! ఏ సుగుణవిలాసుని నోరారఁ 'తమ్ముఁడా!' యని పిలతునో, యే మనోహరగాత్రుని శీతల పరిష్వంగ సుఖమున మితిలేని యానందము జేకూరెడినో, యే వీరావతారుఁడు పజ్జ నిలువ, ఘాతుక మృగతండములపై నేగుదెంచి గను సరవు సేయునో, యా సుసేనకుమారునా, యీ హస్తములు వధించుట! హా! విధీ! నీ వెంత కటికమతివి!

పు. సే.— (కన్నీరునించి) కుమారా! కాశ్మీరనాథుని పంపున న్యాయాధికారులు తీర్పిడుటకు వచ్చెదరు. వారియభిమతానుగుణముగ వర్తింపవలయును. నిన్నే నెంతయో ప్రేమింతును!—కటకటా!—కుమారా! నేఁబోయెదను. బహుశః, ఇదియే కడసారి చూపు!—హా! సుసేనా! హా! సుసేనా! నీవు నాకుఁ గానరావా? మదీయ వంశాబ్ధిచంద్రా! సద్గుణసాంద్రా! భోగదేవేంద్రా! హా! హా!

(నిష్క్రమించును)

వి. సే.— అదిగో! సుమిత్రుఁడు వచ్చుచున్నాడు. అతఁడు మిత్రాఖ్యను సార్థకపఱచువాఁడు. అతఁ డేమిచెప్పునో?

(తెర పడును)



శ్రీ

# ప్రమద్వర

## షష్ఠాంకము



### ప్రథమరంగము

(ప్రదేశము. ఒకచావడి—ప్రవేశము సుమిత్రుఁడు)

ఎన్నిసారులడిగినను, సుసేనుఁడు సజీవుఁడనియే చెప్పెను; గాని యీతనిమరణమును సూచింపుడు. విజయునిఁ గాపాడునుపాయ మేమి? ధర్మముజయించును; సత్యముస్థిరము; అనుమాటయందు నర్థము లేదా? కాలము నిష్పక్షపాత బుద్ధిగల మిత్రము. ముందుముందన్నియు బయలు పడును.—వజ్రపాణి నాలుగుదినములనుండి జ్వరపీడితుఁడు. ఆతఁ డిప్పుడు శల్యమాత్రుఁడు. దయ్యములను జూచునటుల భయపడును. ఆతఁనియవస్థ పగవానికైన వలదు. నేఁడు నన్నాతఁడు చేరంబిలచి, "సుమిత్రా! నేనుచాలదినములు జీవింపను; నాకు మృత్యువు సమీప వర్తిని! నీవు సత్వరముగఁబోయి నామేలికయగు హేమపాలునిఁ బిలచికొనిరమ్ము." అనివాక్రుచ్చెను. హేమపాలునకాతని సందేశ మెఱింగించితిని. ఆతఁడిప్పుడే రాఁగలఁడు. వీరిరువురి సంభాషణము నేనాలింపవలయును. (ముందుచూచి) అదిగో! గదితలుపుచేర వేయఁ బడియున్నది. మెల్లన పోయి వజ్రపాణి మంచముక్రింద దాగుకొని యెదను. పిమ్మట కర్తవ్యమూహింపనగును.—దైవమా! భారము నీ యది! (లోనికరుగును)

# ద్వితీయరంగము



(ప్రదేశము. పడకగది. ప్రవేశము. రోగపీడితుఁడు వజ్రపాణిమంచము మీఁద పొరలుచు; హేమపాలుఁడు ప్రక్కనుగల కుర్చీమీఁద కూర్చుండియుండును)

హే. పా. — వజ్రా! నిన్నుఁ జూచిన విచారము గలిగెడిని.

ఆ. వె|| కనులు లోఁతుకేగెఁ గాంతిదొఱఁగె మేను
గాత్రమెల్లశల్యమాత్రమయ్యె
బొందిలోని ప్రాణి పోయెనో యున్నదో
చెప్పఁజాల; ధాత చెయిదమకట

(వణకుచు) వజ్రా! నీదేహస్థితి యెట్లున్నది? నీవు నన్ను రప్పింపఁ గారణమేమి?

వ. పా — హేమపాలా! తలుపుదగ్గర వేసితివా? నీవొక్కఁడవే యున్నావు కదా?

హే. పా — అవును. తలుపు వేసితిని; భయము లేదు చెప్పుము.

వ. పా — (ఊసురనుచు) మన మొనరించిన దారుణకృత్యముల నెఱుంగ నేరికి నింతదనుక వలనుపడినది కాదు. ఇప్పుడు దుర్జ్ఞేయములగు నుపద్రవములు మనలఁ జుట్టుముట్టినవి! (నిశ్వాసపూర్వకముగా) అబ్బా —

హే. పా — (భయముతో వణఁకుచు) ఉపద్రవములా! ఉపద్రవములా! దుర్జ్ఞేయములా! వజ్రా! తీవ్రములగు బాణములు నాహృదయము గుండ పోవుచున్నవి, నేసైరింపఁజాలను — దుర్జ్ఞేయములా! వజ్రా! కన్నులు మూసెదవేమి? బాష్పములు గార్తువేల? చెప్పుము! చెప్పుము!

వ. పా — చెప్పెదను. — తాళుము! — విజయసేనునిగూర్చి చెప్పెదను.

హే.పా — ఏమీ! దురాత్ముఁడు విజయునిఁగూర్చియా? వాఁడు మనల నేమి సేయఁగలఁడు?

వ.పా — నిన్నరాత్రి నేను చల్లగాలి నాఘ్రాణింప మేడక్రిందకుఁ బోయి రాజమార్గమున నిటునటు ప్రచారము సేయుచుంటిని. అప్పుడొక పురుషుఁడు ముఖము నుత్తరీయమునఁ గప్పుకొని, నన్ను సమీపించి, 'వజ్రా!' యని పిలచెను. నేను వానిని చాలసేపు నిదానించి చూచి, "దుర్జయా! ఇంతరాత్రివేళ నిటకేల వచ్చితివి?" యని యడిగితిని. అతఁడు పుళిందుని సేవకుఁడు; మఱియు నాకు బంధువుఁడు. వాఁడు నన్నుఁ దన యేలిక సౌధమునకుఁ దోకొనిపోయెను. పారావతమను పేరుగల భూగృహమొకండా మేడయందుఁ గలదు. దానం బ్రవేశించిన యనంతరంబ, యొక కారాగృహమునకు దారి చూపెను. — హేమపాలా! ఎవ్వరును లేరుకదా? ఎవరైన విన్న మనకొంప మునుఁగును సుమా? — అందుఁ బ్రవేశించి, విచారభరంబున కళదొఱఁగి యున్న బాలుని నాకుఁ జూపి, "వజ్రా! చూచితివా? సుసేనుఁడు మరణించినటుల లోకము నమ్మినది. నిక్కువం బిట్టులున్నది. పుళిందుఁడీతనిని చెరయందుంచినాఁడు. నీవు హేమపాలునితో, మా యేలిక మాటగా నిట్లనుము. ప్రమద్వరను పుళిందుఁడు పరిణయంబాడ నిశ్చయించెను. కావున నీవు పురందరునితోఁ జెప్పి యీసంబంధము బలపఱుపవలయును. అట్లొనరింతువేని, ప్రమద్వర నాగృహమునఁ గాలుపెట్టిన నాఁడే సుసేనుని వధింతును; లేనినాఁడు సుసేనుఁడు జీవించియున్నవార్త ప్రకటించి, నిన్ను దుఃఖపెట్టెదను. నీజవాబు రేపటిరాత్రి నాకుఁ జేరవలయును. ఇవి పుళిందుని పలుకులు. వజ్రా! మీద నీయిష్టము." అని చెప్పినాఁడు.

హే.పా — (భయముతో) వజ్రా! నీవు జ్వరబాధితుఁడవై యిట్లు పలుకుచున్నావా? ఇది నిక్కువంబు కానేరదు. ప్రమద్వరను కూర్మిరులకా

యప్పగించుట? ఇది నేను చేయఁజాలను.

వ.పా — హేమపాలా? పలుమాటలేల? నేఁటిరాత్రి దుర్గముఁ డిటకు వచ్చును. నీవొకలేఖ వ్రాసి యాతనికొసంగవలయును.

హే.పా — ఏమనివ్రాయ వలయును?

వ.పా — వ్రాయుము. చెప్పెదను. (లేఖవ్రాయును. వ.పా చెప్పును)

"శ్రీవనరాజు పుళిందమహాశయునకు: —

నీసందేశము నాకానందమిచ్చినది. ప్రమద్వరను నీకొసంగి పరిణయము గావింతును. సుసేనుని కారాగృహమున నే వధింపుము. ఆతఁడు జీవించునంతదనుక ప్రమద్వర నీగృహ మలంకరించుట కష్టసాధ్యము. తమ్ముఁడు కళింగునకు నాయాశీర్వాదములు.

హేమపాలుఁడు."

హే.పా — ఈలేఖాంశము లాచరణీయములా?

వ.పా — వెఱ్ఱివాఁడా! భుజంగజాల్ముఁడు మస్తకమునఁగల మణినుపయోగించుకొనునా? ఈగండము గడచినతరువాత ప్రమద్వరను మరల తీసికొనివచ్చెదము. భయములేదు. నాకుబాధయధిక మగుచున్నది. నేనుమరిబ్రతుక నేమో? నాయొనర్చిన పాతకములు దలంపున వారు నపుడు నాకత్యంతము భయమగుచున్నది. అదిగో! సత్యపాలుఁడు! అదిగో! ఆతనిప్రియసుమిత్ర! అబ్బా! నేను వారలను జూడఁజాలను! హేమపాలా! హామ్మ! హామ్మ!

(హే.పా పరుగెత్తి యావలికరుగును. వ.పా ఒడలంతయు బట్టల గప్పుకొనును) (తెరజారును)



# ప్రమద్వర

## తృతీయరంగము



ప్రదేశము. పులిందుని సౌధమున నొకభూగృహము.

(ప్రవేశము వింతముసలిది)

ప్రమద్వర హరణార్థమై పోయిన పులిందకళింగులింకను రాలేదు బహుళః వారింతలోరారు.

తే: గీ॥ మాంసము; ఘృతము; ఫలము లమలమధురస
ము; పలువిధములగు మిఠాయిలు; పెఱుగును, పి
తికినపాలు; శాల్యన్నము దినెడువీరి
కొడలిబలముగాని, కలదె యొండుబలము?

ఆహా! ఏమి! యీగృహనిర్మాణ కౌశలము! ఆసారంగముల లోంతు, ప్రచారమున కనుకూలములగు ఆగుహాలు, వసారాలు, ముద్దు లుమూటం గట్టు ఆగోపురములు—ఎంతచూచినను తనివి తీరకున్నయది!—

తే. గీ॥ వికసితజలజాతమున స్రవించుమధువుం
గ్రోలంబోయి మధుపము తత్కుసుమలీలం
గాంచి యానందమొందినం గలదెఫలము
తెలిసి సమయము, తగురీతి మెలంగవలయు!

(చూచ్చి పారించి) అదిగో! సుజయుండు కునికిపాట్లు పడు చున్నాడు. వానినిసమీపించెదను. (వానిదగ్గరకఱుగును.)

సుజ—(భయాకలితుండై) నీవెవరు?—ఓహో! నీవా! అవ్వా! ఇక్కడ కేలవచ్చితివి!

విం.ము—సుజయా! ఇంతరాత్రివేళ నీవిచ్చటను రాం గారణము?

సుజ— నేనీభూగృహమునఁగల కారాగారముల కధికారిని. పుళింద మహారాజుగారి యాజ్ఞ శిరోగతమునఁ దాల్చి యిచ్చట పహారా యున్నవాఁడ— అవ్వా! సుఖశయ్యాతలమున నుండవలసిన దానవు, ఇప్పుడీ నిశ్శబ్దగృహమున భయంబులేక యొంటరివై తిరుఁగ నేల?

(నేపథ్యమున)

హా! దైవమా!

విం.ము—(ఆలించి) ఏమీ! నిగురయా!

తే. గీ॥ ఇదిగో! కారాగృహంబున హృదయపుటము
భేదమొందఁగ; కన్నులవృష్టిఁగురియ
దీర్ఘనిశ్వాస పవనముల్ తెరపిలేక
వెడల; గతికె సెయ్యను శిరమిడినవాఁడు
వానిఁ గనుఁగొన్న నిద్దుర వచ్చునొక్కొ

(నేపథ్యమున)

సీ॥ జయభక్తమందార! జయసజ్జనోద్ధార!
జయదయాసాగరా! జయతు! జయతు!
జయనిర్మలాకార! జయమంగళాచార!
జయజగత్కారణా! జయతు! జయతు!
జయలోకరక్షకా! జయవిశ్వభంజనా
జయసంతసాత్మకా! జయతు! జయతు!
జయసర్వలోక సంచార! జయపరమ!
జయగుణాకర! ప్రభూ! జయతు జయతు!

తే. గీ॥ కఠినకర్ముఁడ, యీకష్టకాలమందు

నీదయావాహిని పాపనిబిడమైన
హృదయవనమునఁ జొరలేక యెట్టులోప
థముఁగలుగఁజేసికొనెదు; సత్పథవిహార

సుజ — అవ్వా! నీవిటులపడయరాదు. దారిచూపెదను పైకిరమ్ము.

విం.ము — ఛీ! మూర్ఖా! నాకా నీవు బుద్ధిగఱపువాఁడవు. జవాబుచెప్పక కారాగృహ తాళము చెవులను నాకొసంగుము.

సుజ — సాహసము! సాహసము! నేనట్లు సేయఁజాలను!

విం.ము — సుజయా! నీవు మందమతివి. కేసరితోడనా యాటలాడుట? నన్నెదిరించి యెవ్వరు సుఖించిరి! భూతభవిష్యద్వర్తమానకాలముల నెఱుంగఁజాలు నన్నా నీవెదురించుట? ప్రాణములు చేఁదయ్యెనే? మరణదేవత నాశగణుఁగోరితివి! యోచింపుము! యోచింపుము!

సుజ — నా భావిస్థితి యెట్టుండుఁ జెప్పఁగలవా? వినవేడుకయ్యెడు.

విం.ము — నామాట జవదాటవేని, చిరంజీవివై, తులలేని సంపదలువడసి, సౌఖ్యాంబుధిఁ దేలి యాడుదువు. మఱియొండైన, వారముదినములలో మరణింతువు. ఇదినిశ్చయము.

సుజ — నిజమా! నిజమా! — నీకాతాళము చెవులనిచ్చిన, పుళింపఁడు నన్ను బ్రతుకనిచ్చునా?

విం.ము — నేను నిన్నుఁ గాపాడెదను. భయములేదు.

సుజ — (వణఁకుచు తాళము చెవులనిచ్చును)

విం.ము — సుజయా! నీకేమియును భయములేదు. రమ్ము. ఆచెరసాలను సమీపింతము.

(నిష్క్రమింతురు)



# తురీయరంగము



(ప్రదేశము. ఒకచావడి. ప్రవేశము. సుమంతుఁడు. సుమిత్రుఁడు)

సుమం—ఆహా! దైవమాయ! నిర్దోషి నిందపాలయ్యెను. ఆతఁడు రక్షింపఁబడుఁగాక!

సుమి—ఇప్పుడేమి సేయవలయును? నీవేమందువు. ఏండ్లుగడచినవాఁడవు, నీయనుభవము సుప్రసిద్ధము.

సుమం—పురీంద్రసేనుఁ డెప్పుడు వచ్చును?

సుమి—బహుశః రాత్రివచ్చునేమో? న్యాయాధికారులు రాత్రివచ్చెద రట. ప్రమద్వరను, తక్కుంగల స్త్రీజనంబును రాజమార్గమునఁ దోడుకొని పోయిన పురీంద్రుఁ డిపుడు వచ్చునను నమ్మకము బలమైనదికాదు.—

సుమం—అట్లయిన, పురీంద్రునితోఁ గలియుటకు వీలులేదు. ఒకవేళ యాతనికీవృత్తాంతము జెప్పినను, నమ్మఁడు. సుమిత్రా! నీవువచించి నది సూనృతమైనను పాడులోకము పరిహసించును!

సుమి—అవును. నీకుఁదోఁచిన యాలోచన మెట్టిది? ఎట్లయినను విజయునిఁ గాపాడవలయును. ఆలేఖను పదిలముగాఁ బట్టురుమాలునఁ గట్టి దుర్గమున కొసంగను. అబ్బా! హేమంతుఁ డెంతకుఁ దగడు!

సుమం—సుమిత్రా! వినుము. నేనుజీవయాత్ర ముగింపనున్నాను; నీవు ప్రారంభించితివి. ఇత్తరుణమున మన మప్రమత్తులమై సుగుణాల వాలుఁడగు విజయసేనునిఁ గాపాడితిమేని మనజీవితములు పావనము లగును. మనకీర్తిని లోకమెల్ల పాడుచుండ నీవాలింతువు. ఇదియ మనకు బహుమానము!

సుమి—విజయరక్షణార్థమై సింహబిలమునైనఁ జొచ్చెదను! నాకేదియో

తరుణోపాయము దోఁచినటుల నేననుకొను చున్నాను.

సుమం — (తలయూఁచి) సుమిత్రా! సింహద్వారము దరి నాకొఱకు వేచి యుండుము.

(చెలియొకవైపు నిష్క్రమింతురు)

---

## పంచమరంగము

---

ప్రదేశము. పులిందుని సౌధమున నొకవిశాలాగారము.

(ప్రవేశము. పులిందకళింగులు)

పు — తమ్ముఁడా! దుర్జయుఁ డింకను రాఁడేమి?

తే. గీ॥ హేమపాలుఁడు గర్వించి హేళనంబు
చేసెనో! ప్రమద్వర యడ్డుచెప్పెనో? పు
లీంద్రుఁడోప్పఁడో! పటురోషసాంద్రుఁడగుచు
వచ్చును పులిందుఁడని మదిభీతిలేదో?

క — అన్నయ్యా!

తే. గీ॥ భయదనిర్ఘాతపాతంబు వడపున మన
మేగమే ప్రమద్వరును బంధించితేర
దుష్టుఁడు విజయసేనుఁడు దోర్బలంబు
మెరయ విడిపించె నామెను తెరఁగుమాలి

ఛీ! విజయుఁడా మనల నెదురించువాఁడు!

తే. గీ॥ చండకేసరి యడవిలో సంచరించి
జాగిలమరువఁ బరుగెత్తు చరదమయ్యె,

విజయుఁబరిమార్చి, సకియను బెండ్లి సేతు
నీకు శాంతించు; సోదరా! నిశ్చయంబు

అన్నా భయమేమిటికి? హేమపాలుఁ డంగీకరింపక పోయినను
అపై నాశఁగొని యుండఁ గలఁడా! దుర్జయుఁడు శుభవార్తఁ
దెచ్చును.—

(దుర్జయుఁడు ప్రవేశించి)

తే. గీ॥ జయముపవనరాజ! సద్గుణ సాంద్రజయము!
జయముసార్వభౌమ! పరగజహరి జయము!
జయము కకుబంతరాళ ప్రశస్తకీర్తి!
జయము! జయముపులింద! విశాలహృదయ!

(పట్టురుమాలులోని యుత్తరమిచ్చును)

(పులిందుఁడందికొని చదివి కళింగున కొసఁగును)

క—(చదివికొని, బల్లపైనుంచి) శెబాస్! అన్నయ్యా! హేమపాలుని
నల్లగుండియ పగిలియుండును గాబోలును!

దు—దేవా! విజయసేనుఁడు మఱి యీలోకము వాఁడుకాడు. నేఁడే
న్యాయాధికారులు వచ్చెదరు. రేపుమధ్యాహ్నము మూఁడుగంట
లకు విచారణ మారంభింతురట.

పు—సరియె. దుర్జయా! నీ మేలుమఱవము.

(దుర్జయుఁడు నిష్క్రమించును)

సేవకుఁడు—(ప్రవేశించి) జయము! పులిందరాజా! జయము! ద్వారము
దరి గాయకు లిరువురు వేచియున్నారు. ముదలయయ్యెనేని, తోడ్తె
చ్చెదను.

పు—(కళింగునితో)

తమ్ముఁడా!

## ప్ర మ ద్వ ర

ఆ. వె॥ నేఁడుశుభదినంబు; నిండు
ర్వధరణీధరంబు పైనిపొ
గాయకులనుబిల్చి గానం
సమయ సముచితంబు వి

క — అన్నా! నీయిష్టమున కడ్డుగలదె?

తే. గీ॥ బాణవేగమున సతము పారునేఱు
నకొకతఱిబలమైన బంధంబుగలు
వచ్చుఁగాని, నీయభిలాష పారివా
డాక నడచు నిరంకుశత్వంబుఁ బు
గాయకులను రప్పింపుము. వినోదము గాఁ

పు — (సేవకునితో) ఓరీ! వారల నిటకుఁ బిలువు

(సేవకుఁడు నిష్క్రమించును. సుమంత సు
ములతోఁ బ్రవేశింతురు)

(పులిందు నుద్దేశించి)

సు॥ సుమి—కం॥ధీరుఁడవు; సకలగుణ వి
స్తారుఁడవు; విమలయశో వి
కారుఁడవు; శుభచరిత్రా
ధారుఁడవు; నిన్నుఁబొగడఁ

సుమం — రాజాధిరాజా! వనరాజా! పులిందా! దేశవ
నిర్వక్ర పరాక్రమ క్రమణ ధురీణుఁడవగు నీదర
నిండారు భక్తితోడ వచ్చితిని. ఇదిగో! వీఁ
నాతోడ సతంబుఁ దిరుఁగుచుండును. కరుణించి త
చి నీకర్నేంద్రియములకుఁ బండువు సేయుం డున

పు.— ఓయీ! నీ పేరేమి?

సుమం.— రాజేంద్రా! నా పేరు విశాఖులుండందురు. నా మనుమని పేరు శ్రావణుఁడు.

క.— నేఁడేలినవారు కరం బానందంబుననున్నారు. వీరు శాస్త్రవ్రతముగఁ బాడుదురేని, బహుమానమందెదరు.

సుమం.— చిత్తము! (గవిసెన వెడలించి, వీణ కరంబునఁ గొని గానము సేయును. సుమిత్రుఁడు కూడ పాడును.)

పు.—హాయి! హాయి! వీరు మానవమాత్రులా! గంధర్వులు!

క.—నిజము! నిజము! ఆహా! ఏమి శ్రావ్యము గానున్నది!

సుమం॥సుమి—(పాడుచు నేయుందురు)

(పులిందుఁడు, కళింగుఁడు కొంతవడికి కుర్చీలమీఁద నే నిదురింతురు సుమంతుఁడు బల్లపైని పట్టురుమాలులోని లేఖను దీసికొమ్మని సుమిత్రునకు సౌజ్ఞ చేయును. సుమిత్రుఁడు తీసికొని జేబులోఁ బెట్టుకొనును. పాఁటపాడుచు నిరువురు నిష్క్రమింతురు.)

(తెరపడును)





శ్రీ

# ప్రమద్వర

## సప్తమాంకము



### ప్రథమరంగము

(ప్రదేశము. విశాలమగు చావడి. ప్రవేశము. న్యాయాధికారి
యాసనాసీనుఁడై లేఖకోద్యోగి న్యాయాధికారిసమీ
పమునఁ గూర్చుండును. పురీంద్రసేన హేమ
పాలురొక వైపుఁ గూర్చుండుదురు.
విజయసేనుఁడు మరియొక వైపు ని
లువంబడి యుండును. ప్రతీ
హారి వనపాలురిరువురు ని
లువఁబడియుందురు.)

న్యా:— సభ్యులారా! నేఁడు మనమందఱ మిచ్చోట సమావేశమగు
టకుఁ గారణ మెఱుంగుదురుగదా? వీఁడుగో, మనసమక్షమున నిలువం
బడిన పురుషసింహము విజయసేనుఁడు. వీని ప్రస్తుతావస్థఁ దిలకింప,
నిర్దోషివలెఁ జూపట్టుచున్నాఁడు. (హేమపాలుఁ డిటునటుఁ
జూచును.) ఈతఁడు చిఱుతప్రాయమున పురీంద్రుని గృహమున విడ
వఁబడియెను. వీని తలిదండ్రులెవ్వరో యింతదనుక తెలియదయ్యె.
పురీంద్రసేనుఁడు సహజకరుణామతియగుట నీతనిని తనబిడ్డలతో సమ
ముగాఁ జూచుచుండెను. చైత్రోపహతుఁడగు పురీంద్రసేనుఁడు
ముల్తానుదేశాధీశుని కోపమునకుఁ గారణభూతమగుట మీరెల్లరెఱిం
గిన విషయము. హేమపాలుఁడు స్నేహధర్మము తెలిసినవాఁడగుట

పురీంద్రసేనునకుఁ దనగృహమొసంగి, కష్టకాలమున సత్కరించెను.
పురీంద్రసేనుఁడు శ్రీనగరమున కరుదెంచిన పదునైదుదినముల తరు
వాత విజయసేనుఁడు ప్రమద్వరను ప్రేమించినటు లెఱింగెను. సుసే
నున కావాఁటఁగోలె విజయునియం దసూయజనించెను. తెలివైనవాఁ
డగుట పురీంద్రసేనుఁడు విజయునితోఁ దఱచుమాటలాడక, సహ
పంక్తి భుజియింపక, ప్రమద్వర సమక్షమునకుఁ బోనీయక, యొక
విధంబగు నిర్బంధమునను౦చెను. సుసేనుఁడును విజయుఁతో నంతగా
మాటాడలేదు. హేమపాలుఁడు ముల్తానునగరమునుండి వచ్చినతరు
వాత విజయుని వర్తనము గ్రహించి కరంబునొచ్చుకొనియె. పురీంద్ర
సేనుఁడు హేమపాలునకుఁ గూతునీయ సమకట్టి యామెయంగీకారము
వడయనిది యట్లుగావింప నేరఁడయ్యె; గాని ప్రమద్వర తనమనోరథ
మిట్టిదని చెప్పక దినములు బుచ్చుచుండెను. సుసేనుఁడు సమ్మతింపఁ
పురీంద్రసేనుఁడు హేమపాలునకుఁ దనయ నొసంగ సన్నద్ధుఁడయ్యె.

చుట్టుప్రక్కలఁగల దుర్గాధిపతులను వివాహమున కాహ్వానమొనరిం
చెను; గాని దుర్మార్గులగుటవలన పుళిందకళింగులను వనరాజులను
మాత్రము కళ్యాణమహోత్సవమునకుఁ బిలువఁడయ్యె. ఆ సోదర
ద్వయము పురీంద్రసేనుఁడు చూపిన యగౌరవమున కత్యంతాగ్రహ
మొంది బలాత్కారమునఁ బ్రమద్వరను దొంగలించుకొని పాఱి
పోయిరి. రోహిణియను చెలికత్తె యేడ్చుచుఁ బరతెంచి యివ్వార్తలోన
నెఱింగించెను. పురీంద్రసేనుఁడు, హేమపాలుఁడు ముందు హయంబుఁ
బరువెత్తింప, సుసేనాయుతుఁడై, పుళిందకళింగుల వెంబడించెను;
గాని విజయసేనుఁడు భయంకరఖడ్గమును ఝళిపించుచుఁ బోయి
ప్రమద్వరను దుష్టులబారినుండి తప్పించి, గృహంబుఁ జేర్చెను. పురీంద్ర
హేమపాలురకు గాయములపెండ గాయములు తగిలెను. తత్కారణ
మున వివాహము తప్పిపోయెను. సభ్యులారా! తరువాత జరిగిన విష

యామును జాగ్రత్తతో గమనింపుడు. నెలదినములవఱకును విజయ
సేనుఁడు ప్రమద్వరను జూడలేదు; తరువాత నొకనాఁడు వారేకారణ
మున్నో వనప్రదేశమునఁ గలిసికొనిరి. రోహిణికూడ వెంటనుండెను.
అప్పుడు సుసేనకుమారుఁడు వారలను దూరమునఁ గాంచి, హాహారావ
ములు సేయుచు, సమీపించెను. ప్రమద్వరను కఠినోక్తుల నొప్పించెను
రోహిణిని చీవాట్లు పెట్టెను. ములికిపలుకుల విజయసేనుని బాధించెను
ప్రమద్వర రోహిణీ ద్వితీయయై సోదరానుమతిని గృహంబునకుఁ బోవు
చుండెను; మేఘగంభీర భాషణముల సుసేనుఁడు విజయసేనుని దూల
నాడుచుండెను. రోహిణీప్రమద్వరలు వెనుదిరిగి చూచిరి. సుసేనుఁడు
మిలమిల మెఱయు ఖడ్గమును బలము వెలయ గరగరఁ ద్రిప్పుచుండెను.
విజయుఁడు కోపకషాయిత లోచనుఁడై యొరమీద కరమిడెను; కర
వాలమును మాత్ర మూడబెఱుకలేదు. ఆబాలిక లెఱిఁగిన దింతియ.
తదితర విషయములు సాక్షివిచారణవలన సభ్యులు గ్రహింతురు.
(ప్రతీహారినిఁ జూచి) ఓసీ! నీ వెఱింగినదేమి? దాచక చెప్పుము.

ప్రతీ — న్యాయాధిపా! నిక్కము వచింతు. దైవము సాక్షి! విజయసేనుఁ
డరణ్యమునుండి వికలమనస్కుఁడై వచ్చెను. అతని వస్త్రములు రక్తమయ
ములై యుండెను. చేతఁ గృపాణములేదు. ఒరమాత్రము ప్రక్కను
వ్రేలాడుచుండెను. "బాబూ! ఈరక్తమేమి?" యని నేనడిగితిని.
అతఁడుత్తరమీయలేదు. లోనికరిగెను. నాయెఱిఁగినదింతియ. (లేఖ
కోద్యోగి వ్రాయును)

న్యా — నీవు పొమ్ము. వనపాలకులారా! మీకుఁ దెలియునదేమి?

వ.పా — న్యాయాధిపా! అనృతమాడను. దైవము సాక్షి! నేను వనమునఁ
గుమ్మరుచు రక్తభరితంబైన మడుగునొండు గాంచి, భయంబుతో నటకు
పోయితిని. మనుష్యసంచార మచ్చటఁ దోఁచలేదు; గాని తడిప్రదేశ
మగుటవలన మనుష్యుల యడుగుల చిహ్నములు స్పష్టముగాఁ గాన

వచ్చుచుండెను. ఆమడుగులో ఖడ్గఖండమొండు గోచరమయ్యెను; దానిం గొనితెచ్చి పురీంద్రసేనున కర్పించితిని. (లేఖకోద్యోగి వ్రాయును)

2వ.పా— దేవా! సత్యముపలికెదను, దైవముసాక్షి! చేపలుపట్టుటకై నా కుమారునితో వనోత్తర భాగమునఁగల నదికేగితిని. అందువల వేయుటయు నొకశిరోవేష్టము దొఱకెను. దానిని పురీంద్రసేనున కొసంగితిని. (లేఖకోద్యోగివ్రాయును)

న్యా— సరియె. మీరుపోవచ్చును. (హేమపాలునివంక దిరిగి) హేమపాలా! నీవెఱింగిన యంత యథార్థముగ నాకుఁ దెలియఁ జెప్పుము.

హే.పా— (నిలువంబడి) న్యాయాధిపా! దైవముసాక్షిగా సూనృతము పల్కెదను. అవధరింపుము. పురీంద్రసేనుఁడు విజయుని నిర్బంధనమున నుంచెను. వాఁడెట్టులో తప్పించుకొనిపాఱిపోయెను; నా సేవకుఁడు వజ్రపాణి యాదురంతమును గనిపెట్టి యిరువురు సేవకులను వానింబట్టి తేరఁబుత్తెంచెను. విజయుఁడు వారలను సంహరించి, విమలాంగియగు ప్రమద్వరను పుళిందకళింగులు హరించి, పాఱిపోవుచుండఁ గాంచి, వారల నెదుర్కొనియెను. కొంతవడికి వారలనోడించి, ప్రమద్వరను గృహంబుఁజేర్చెను. పిమ్మట వజ్రపాణినిఁ బిలచి, "ఓయీ! నీయేలిక హేమపాలుఁడు సత్యాపవర్తియే నా? అతనిని బిలువుము" అనివార్తఁబంపెను. నేను కడుంగడు భయంబున వానిని దరిసితిని. కన్నీరు మున్నీరుఁ గార్చుచు, నాతో నాతఁడిట్లనియె. "ఆర్యా! నేను పాపకర్ముఁడను. కోపమునవశలోనై పాపమనిజంకక సుసేనుని వనీతలమున సంహరించితిని. నీసేవకుల నిరువురను బరిమార్చితిని. హంతకుఁడనగు నాకు శాంతియెక్కడిది?" అనిపల్కెను. వానియవస్థఁ జేయునదిలేక యూరకుంటిని. (వి.సే ఆశ్చర్యమభినయించును

(లేఖకోద్యోగి వ్రాయును)

న్యా—వజ్రపాణిని రప్పింపుఁడు. (సేవకులు వ.పా తీసికొనివత్తురు ఆతఁడు వణఁకుచు నిలువఁబడును)

న్యా—వజ్రపాణీ! నీకీయభియోగమునఁ దెలియు విషయము లేమేనిఁ గలవా? భయములేదు. మెల్లనఁ జెప్పుము.

వ.పా—నాకుఁదెలిసిన విషయము లెన్నియో లేవు. విజయుఁడు కారాగారమునుండి తప్పించుకొనియె; అదియెఱింగి హేమపాలుని సేవకుల నిరువుర నాతనింబట్టి తేరఁబంపితిని. వారల నాతఁడు సంహరించెను. ప్రమద్వరతో గృహమున కరుదెంచెను. నన్నుఁ జేరంజీరి, "ఓయీ! నీయేలిక హేమపాలుఁడు సమీపవర్తియే నా? ఆతనిని బిలువుము" అనిపల్కెను. నేనట్లు గావించితిని. (వణఁకుచుఁ గ్రిందఁబడి తికిలపడును) [లేఖకోద్యోగి వ్రాయును]

న్యా—సభ్యులారా! సాక్షివిచారణ మైనది. పైవిషయములు చర్చించి చూడ, విజయసేనుఁడు కేవలము నిర్దోషియనుటకు వలనుపడదు. అయినను, ఆతఁ డేమనునో, విచారింపవలయును. (విజయసేనునివైపు మోమై) విజయసేనా! వీరందఱుఁ జెప్పినది నీవాలించితివిక దా? ఇందసత్య మేమైనఁగలదే?

వి.సే—న్యాయాధిపా! సత్యమొక్కటి; అనృతము వేయి విధములు. లోకమసత్యము నే గారవించుఁగాక! అసత్యవాదులే విజృంభింతురు గాక; సత్యమేకడకు జయించును. సూనృత మపజయమొందు నేని, తిక్కులురాలవే? కొండలుకూలవే? అంబుధులింకవే? ఎన్నెన్ని యుత్పాతములు జూపట్టవు?—(కొంచెమాగి) పురీంద్రసేనుఁడు నాకుఁ దండ్రిసమానుఁడు. ఆతనికుమారుఁడు సుసేనుఁడు నాప్రియ సోదరుఁడు. ప్రమద్వరమాత్రము నాప్రియకాంత! ఇదిహాస్యార్థమా? విశాలభువన ప్రదేశమునఁగలవస్తుజాలములన్నియుఁ గాలక్రమమున

నశింప, నెద్దియక్షయంబై, యుజ్జ్వలంబై, నిరుపమానమై ప్రకాశిం
చునో, యా ప్రేమయను మధురపదంబునఁ గల గంభీరార్థమును
స్వానుభవమువలన గ్రహించి, యానందించు పురుష సత్తమునకుఁ
గాక, తదితరులకు నాపలుకు హాస్యార్థమును స్ఫురింపఁజేయును
గాను! ప్రమద్వరను నేను మనోవాక్కాయ కర్మల ప్రేమించితిని;
వీణవాయించిన మధురగీతము వెలువడదే?—నిజమైన ప్రేమయెన్నఁ
డేని సంతోష ప్రదముగా జయంబొందెనా? ఒకనాఁడరణ్య భాగ
మున మృగయానంతరము సంభాషణ వశమున నామనోరథమును
ప్రమద్వరకెఱింగించితిని. నేనొనరించిన ప్రమాదమిదియె. సుసేనుఁ
డది తెలిసి ప్రమద్వరకెఱింగించెను. అతఁడు కరంబునొచ్చుకొని
క్రొత్తవానిని జూచునట్టుల నన్నుఁ జూచుచుండెను. తరువాతనే
మేమి జరిగెనో మీరెఱుంగుదురు.—ముఖ్యాంశమాలింపుఁడు. మఱి
యొకతఱి తద్వనీతలమున నే ప్రమద్వరను గలిసికొంటిని. సుసేనుఁడు
మరలయటకరుదెంచెను. అతనికోపము కడుతీవ్రమైనది. దుర్భాషల
నన్నునొంచెను; బాధించెను. నాకాతనియందుఁ గల మిక్కుటమగు
ప్రేమ నన్నాతని నేమియుఁ జేయనియ్యదయ్యె. ప్రమద్వర రోషి
ణితో నిష్క్రమించెను. సుసేనుఁడు కన్నుఁగవనుండి యగ్నికణములు
రాల, దిక్కులు ప్రతిధ్వనింప, నీచోక్తులనన్ను దుఃఖపెట్టెను; నా
యందుఁ గోపాగ్ని రవులుకొల్పెను. అప్పుడు నేనొరపైఁ గరమిడితిని;
నాయవివేకమునకు నే నేసిగ్గుపడి క్షమింపుమని సుసేనునిఁ బ్రార్థించి
తిని. అతఁడాలింపఁడయ్యె. హయంబెక్కి వనాంతరభాగమునకుఁ
బోవసాగితిని. అతఁడును నా వెంటవచ్చెను. నన్ను దూషించుచు నే
యుండెను. కటకటా! అదియెంతకష్టదినము. నేనాతని వాక్సాయ
కములను లెక్కసేయక గుఱ్ఱమునదలించుచుంటిని. వనోత్తరదిశకుఁ
బోవుసమయమున, భయంకరముగ నగుపించిన యొకటి మాకెదు

రయ్యెను. ఛురికనుఁ గత్తిదూసి దానినెదిరించితిని. ఏకారణముననో
యది సుసేనునివైపుపోయెను. (పు.సే భయముతో నాలించును
హే.పా వెలవెలపోవును. వ.పా 'హా!' యనియఱచును) — సభ్యు
లారా! నన్నాలింపుఁడు. ఇందాశ్చర్యమునకుఁ గారణములేదు. సుసే
నుఁడు కొంతదనుక దానితోఁ బోరాడి, హయంబును బరుగెత్తించి
యెందేనిం జనియె. నేను హయంబుఁడిగ్గి. యామృగమున కెదురై నిల్చి
తిని. భయంకరములైన కోరలతో నన్నుఁ జిమ్మవలయునని నాపై
కదిగర్జించుచు వచ్చెను. ఖడ్గమును దాని కంఠతలమున నాటితిని.
ఆదారుణ ప్రహారమున నామృగము ప్రాణములువిడచెను; కత్తిరెండు
తునియలయ్యెను. నాదుస్తులు రక్తమయములయ్యెను. ఆప్రదేశము
తడిసినదగుట; నడుగులజాడ స్పష్టముగాఁ గానఁబడియెడు; నెత్తురు
మడుఁగుగలుగఁ గాంచ మిదియు, సుసేను నరయ నేను హయంబును
సత్వరము బరుగెత్తించితిని. ఎంత వెతకినను, ఆతఁడు గానఁబడఁ
డయ్యె. వధించిన యడవిపందినిఁ గొనిపోవ నెంచి మగుడి యట కరు
దెంచితిని; గాని యెవ్వరో దాని నపహరించిరి. విచారగ్రస్తుఁడనై
గృహమునకరుదెంచితిని. దౌవారికుని ప్రశ్న నాకు వినఁబడ నేలేదు.
నామనోగతమప్పుడు సముద్రము ననుకరించుచుండెను! — మఱియొక
మాట. ఇప్పుడు హేమపాల వజ్రపాణులు మీసమక్షమునఁ జెప్పి
నది కేవలమనృతము. హేమపాలుని సేవకులాతని యనుమతివడసి
నావెంటవచ్చిరి. వారిరువురు నాచే సంహరింపఁబడలేదు. పులింద
కళింగులు ప్రమద్వరను దోకొనిపోవుచుండ వారల నెదిరించితిని. హేమ
పాలుని సేవకులు నాకుఁదోడ్పడిరి. కళింగుఁడు వారల జముని కేతన
మునకనిపెను. ప్రమద్వరనుద్ధరించి గృహమునకుఁ దెచ్చితిని. వజ్ర
పాణిని నేను చూడలేదు. హేమపాలునితో మాటాడలేదు. దోషి
'ని చెప్పి మన్నింప వేఁడుకొనలేను. - ఇదియు జరిగిన వృత్తాంతము.

(లేఖ కోద్యోగి వ్రాయును.—పు. సే కన్నీరువిడుచును. హే.పా భయమునూచించును. వ.పా హా! యని యఱచి పొరలును)

న్యా—(ఆశ్చర్యముతో) సభ్యులారా! విజయసేనుని మీరాలించితిరి గదా? ఈతఁడు చెప్పినదంతయు నిజమో కల్పనామాత్రమో యగును. (వి. సేనునిఁజూచి) విజయసేనా! ఇందుకుసాక్షులెవరైనఁ గలరా?

వి. సే—న్యాయాధిపా! వేయికన్నులతోఁ జూచు భగవంతుఁడే యిందులకు సాక్షి! అనపరాధుల నాతఁడు సంరక్షించును.

న్యా—సభ్యులారా! తీర్పుచెప్పుటకు నాకేమియును దోఁచకున్నయది. విజయసేనుని ముఖవిలాసమును బరీక్షసేయ నాతఁడు నిర్దోషియని తోఁచెడిని. హేమపాలుఁడు గౌరవనిలయమగు కులసంభూతుఁడు. ఆతఁడనృతము వచించునా? —

(నేపథ్యమునఁ గలకలము)

[సభవారందఱాశ్చర్యముతో నాలింతురు.]

(విం.ము. సు సే. సుమం. సుమిత్రులు ప్రవేశింతురు.—సుసేనుఁడు. వి. సేనుని కౌఁగిలించుకొని యేడ్చును)

ఉ. ఎందుననుండి వచ్చితివి? నీవు సుసేనుఁడవా? మదీయయా
నందమ! స్రుక్కినాడవు; వనంబున నిన్విడనాడి, మొండినై
బొందిని నిల్పినాను; తొలిపుణ్యము హేతువుచేత నీవు నా
ముందర నిల్చినాడవు; ప్రమోదము పట్టఁగఁజాల, తమ్ముఁడా

పు. సే—హా! కుమారా!

ఆ. వె. రారనాయనా! వరాలమూట! సుసేన!
రార, మన్మథ సుకుమార! రార
రార కులపయోధి రాకాసుధాకరా!

రారయ్యసుపుత్రా! రారతండ్రీ!

(కౌఁగిలించుకొనును; శరీరము నిమురుచు) కటకటా!

సీ॥ పాలుగారెడుమోము బాష్పధారలుగార
చీకాకుపడి కళ చెదరిపోయె
సంస్కారణములేమి చక్కని కుంతల
ములు జడకట్టి కోమలతఁ బాసె
ఉన్నతోరతలము నొప్పిదము కనుల
నగుపడరాక లోఁతుగ నణంగె
అరిజనావళి గుండియలవియఁజేసెడు
బాహుపాశంబుల బలము సడలె

తే. గీ॥ కటకటా! యిన్నినాళులు కష్టపడుచు
నెందునుంటివో, యాహారమేదియో, యె
వండు నిన్నుబాధించెనో పలికినాడు
చింతఁ దీర్పుము తనయా! సుసేన! వేగ

సుమం—(సుమిత్రునితో) కుమారా! హేమపాలుఁ డావలికిఁ బోవకుండ చూచుచుండుము.

సుసేనుఁడు.—(విజయసేనునితో) అన్నయ్యా!

తే॥ గీ॥ నీవు సుగుణమూర్తివి; దయానిధివి; వీఁడె
యుంగక నిను దుర్భాషల భంగపెట్టి
నిశిత కరవాలమునఁ జంప నిలచినాఁడు

మఱువు నాదురితంబు; నమస్కరింతు!

(ప్రణమిల్లును)

వి. సే.—తమ్ముఁడా! ఇందు నీతప్పిద మేమియును లేదు. నాయందు నీవగు పఱచిన తులలేనిప్రేమను నేనర్హుఁడఁగాను.

సుసేనుఁడు.—(కన్నీరుగార్చి)

తే॥ గీ॥ నాదుచెలిగారముఁ గొనిన నాఁటఁగోలె
కడిఁది దుఃఖంబు నపకీర్తి పడుటెగాని
కంటనిద్రయు నన్నంబు కడుపునకును
లేక శోషిల్లినావు; సుశ్లోకచరిత!

నీయభిమానము నే నెట్లు దీర్చుకొందును? నన్నింకను ప్రేమింతువు. అన్నయ్యా!

ఆ॥ వె॥ హితునిదోషములు సహించు స్నేహితుఁడు సు
వ్రతుఁడతండు పరమహితుఁడు సుమ్ము
అట్టివాని వడసినందుకు నీయందు
నాదు భాగ్యమేమనంగవచ్చు?

న్యా—మిత్రవరులారా! తేనియతేఁటలొలుకు మీమాటలు వినఁ దనివి తీరకున్నయది. సుసేనకుమారా! నీవిన్నాళ్లెందుంటివి?

సు. సే—న్యాయాధిపా! వనప్రదేశమున వరాహమునొండుగాంచి, విజయద్వితీయుఁడనై దానినెదిరించితిని; ఒకవిధమగు ఆందోళనము హృదయమునఁ గలఁతవెట్ట హయంబును బరుగెత్తించి వనాంతరభాగమున కఱిగితిని. కొంతవడి కాయాసమధిక మగుడు, శీతలతరుచ్ఛాయఁ గొండొకసేపు విశ్రమించితిని; గాని మనంబూరటఁ జెందలేదు. మెల్లమెల్లన హయంబును నడపించుకొనుచు విజయసేనుని విడచిన

చోటున కరుదెంచితిని. ఆతఁడచ్చటలేఁడు; గాని జీవములుగోల్పడి యడవిపంది యచ్చోటఁ బడియుండెను. సమీపమునఁగల సెలయేటి తీరమునఁ గూర్చుండి విజయుని రాక నిరీక్షించుచుంటిని. అత్తటి నశ్వపుడెక్కల చప్పుడు వినవచ్చెను. ఉత్తరక్షణమున పుళిందుఁడు పరివారముతో నన్ను సమీపించెను. వానితో భయంకరయుద్ధమొన రించితిని; గాని యొక్కఁడనగుటచే గార్యము లేకపోయెను. కొందఱా యడవిపందిని మోసికొని నడువసాగిరి. నేను సమీపమునఁగల ప్రవాహమున దుమికితిని; నాశిరోవేష్ట మంతుపడిపోయెను. కొంతదనుక వారికి నేను దొరకలేదు; అలసిపోయితిని. అప్పుడు నన్నాతఁడు బంధించి, తనగృహమునకుఁ దోకొనిపోయెను. దారిపొడుఁగున నన్నాతఁడు తీవ్రభాషణముల నొప్పించెను. మఱియు నిట్లనియెను.

తే. గీ. అంపమునఁ జీల్చి భయము దీపింప ముక్క—
ముక్కలుగఁగోసి, మఱుఁగు చమురున వేఁచి
గ్రద్దలకును కాకులకును రామబంధు
గులకును విసరువాఁడ, నిక్కువముసుమ్ము

నేను వానికి జవాబుచెప్పలేను. పారావతమను పేరఁ బరఁగు భూగృహమందొక కారాగృహమున బంధించి యుంచెను. తద్గృహాధికారి సుజయాభిధేయుఁడు. వాఁడు దినమునకొక్కసారి ఎండిపోయిన రొట్టెనొకటి నాకాహారమిచ్చుచుండెను. దానిని నేను సాధారణముగా భుజియించి యుండలేను. తరువాతి వృత్తాంత మామె యెఱింగింపఁగలదు.

(విం. ముసలిని చూపును)

శ్యా—అహా! నిన్నుఁజూచినతోడన కరంబాశ్చర్యము గల్గెడిని! నీవృత్తాంత మెఱింగించి మమ్ము కృతార్థుల నొనరింపుము.

వి.ము — న్యాయాధిపా! సభ్యులారా! ఇందు సభాంతరాళమున మానవతి యెలుఁగెత్తి మాటాడరాదు. విజయసేనుని రక్షణార్థము ప్రాణములను తృణప్రాయముగాఁ జూచు నేనిప్పుడు నిర్భయముగా మీకెల్లరకుఁ గొన్ని విషయము లెఱింగింపవలయును. నాకథాప్రారంభమునకు మును ముందు మిమ్ముల నొండు ప్రార్థించెదను. కరుణాయత్తులై తీర్పు వేడెద; హేమపాలవజ్రపాలులను నా సమక్షమున నిలుపఁబెట్టుఁడు.

న్యా — (హే.పా — వ.పా తో) మీరిటు రండు. (హే.పా వి.ము సతిని సమీపించి వణఁకుచు నిలువంబడుదురు)

వ.పా — హా! మరణదేవతా! కరుణింపుము. (క్రిందపడి పొరలును)

వి.ము — ఆర్యులారా! నేను సునంద యను పేదిఁటదానను. నా తలిదండ్రు లొక బీదకుటుంబమునకుఁ జెందినవారు. నాకన్నదమ్ములు గాని; యక్కచెల్లెండ్రు గాని లేరు. ఈ సౌధరాజమున కనతి దూరమున వృద్ధులగు నా జననీజనకులతో వసించుదానను. ఒకనాఁడు హేమపాలుని యన్న మా గృహమున కరుదెంచెను. నన్నాతఁడు ప్రేమభావమునఁ బలుకరించెను. ఆతని పలుకులు నా చెవులకుఁ బ్రమోదముఁ గలిగించెను. ఆతని మందస్మిత జ్యోత్స్నలు మదీయ హృదయతమంబును హరించెను. ఆతఁడు తఱచు మా యింటికరుదెంచి, నా హృదయమునఁ బ్రేమబీజమును నాటెను. నానాఁటికది పెరిగి, వృక్షమయ్యెను. సత్యపాలుని తండ్రి మృతిఁబొందు నపుడాతనిఁ జేరంజీరి, "కుమారా! నీవు వివాహమింకను జేసికొనియుండలేదు. సాంప్రదాయముగల కుటుంబమున నుండి యొక కన్యారత్నమును బరిగ్రహించి, వంశోద్ధరణ మొనర్పుము." అని చెప్పెను. పితృవాక్య మనుసరించి సత్యపాలుఁడు సుమిత్రయను కాంతామణినిఁ బరిణయంబాడెను; గాని నాతోడి స్నేహము మానలేదు. నన్నాతఁడు మనస్సాక్షిగా వరించెననియు, నొండు కాంతను గ్రహింపఁడనియు నమ్మికొనియుంటిని; గాని దైవనిర్ణయ

మన్యమగు డాతని కెదురాడ నోడితిని. వివాహానంతరము నన్నా
తఁడు తిఱిగి చూడలేదు. నాజననీజనకులు మరణించినతరువాత,
శూన్యగృహమునందుండ నిష్టములేక, సత్యపాలునిఁ గన్నారఁజూచి
యైన సంతోషింప నగునని యెంచి సైరంధ్రీవేషమును దాల్చి సుమిత్రా
దేవి యంతఃపురమును జేరితిని. సత్యపాలుఁడు నన్నుగుర్తింపఁడయ్యె.
కొంతకాలము గడచినతరువాత పరమేశ్వరుని కృపవలన సుమిత్రా
దేవి గర్భముఁ దాల్చెను; శుభలగ్నమున సుపుత్రోదయమయ్యెను.
—పుత్రునిఁ జూచుకొని నావిచారములన్నియు మఱచితిని. వజ్రపాణీ!
వినుచున్నావా? సునంద జీవములతోనున్నది. హేమపాలా! నీకిప్పుడు
చావుడు రాదని తలంచెదను. నీవలన నేపడిన భంగపాటు నీశ్రేయాభి
వృద్ధికిఁ గారణమయ్యెనని యింకను నువ్విళులూరుచున్నాడవా?—
సభ్యులారా! నాకన్నీళ్లు మన్నింపుడు!—దుర్వినయుఁడై హేమపాలుఁ
డెన్నియోసారులు నన్నుఁ బరిభవింప యత్నించెను. వజ్రా! ఇది
యబద్ధమా?

వ.పా—సునందా! అపరాధములెన్నెని చేసితిని. నన్ను మన్నింపుము.
నీవు ప్రజ్వలితాగ్నికీలవు! నిన్ను స్పృశింప నెవ్వరు సాహసింతురు?—

సునంద—తరువాత, విఫలమనోరథుఁడై నన్నాతఁ డంతఃపురమునుండి
తొలివేయ నెంచి, యన్నగారితో నామీద కొండెములు గల్పించి
చెప్పుచుండెను. సత్యపాలుఁడు సత్యపాలుఁడు! తమ్ముని వృథాడంబ
రములు నమ్మలేదు. తత్కారణమున నాతనిపైనలిగి హేముఁడాతని
నెట్టయినఁ గళత్రసహితముగా వధింప నెంచెను, మఱియును కళ్యాణి
పురాధిపత్యమున కాశించెను. కటా! ఆవృత్తాంతము నేగ్రహింపఁ
జాలనైతిని. ఒకనాఁడు సుమిత్రయు సత్యపాలుఁడును సుఖశయ్యా
నిద్రించుసమయమున వజ్రపాణి వారలను సంహరించెను!

వ.పా—హా! దురాత్ముఁడు హేముని ప్రోత్సాహమున నేనా దారుణ

మున కియ్యకొంటిని! (వేదన నభినయించి) హా! హా! నాపాపరాశి మిన్నుముట్టినది!— ప్రపంచమంతయుఁ గంటకావృతమై చూపట్టె డిని. సునందా! (వణఁకుచు) మన్నింపుము! నేమరణించెదను.—

హే.పా— (భయముతో నిటుజూచును; వణఁకును)

స్యా— సునందా! తరువాత; తరువాత?

సునంద.— పిమ్మట సత్యపాలుని కుమారునిఁగూడ, హేముఁడు బ్రతుక నీయఁడని తలంచి, నిశాకాలమున నేరికిఁ దెలియంగరాక, బాలుని నెత్తుకొని, దూరప్రయాణజనిత ప్రయాసమున కోర్చి రెండుదినములలో ముల్తానునగరమునఁ ప్రవేశించితిని. పురీంద్రసేనుఁడు సుగుణాభిరాముఁడని ప్రజలవలన నాలించి, యర్ధరాత్రమున నాతనిచావడిలోఁ జిఱుతప్రాయంపు బాలుని విడచి, కన్నీరుఁ దుడిచికొనుచు, నాయూర రోగిని వేషమునఁ దిరుగుచుంటిని. విజయసేనుఁడే సత్యపాలుని కుమారుఁడు!—

హే.పా— హా! దైవమా! నిజముదాగదు! నామీద మహోన్నత మహీధరము పడినది. గత్యంతర మేమి?

సునంద.— విజయసేనుని పలుమారు చూచికొని మితిలేని యానందమొందుచుంటిని. కొన్నిదినముల తరువాత సురపాలుని కోపమునకు లోనై పురీంద్రసేనుఁడు ముల్తానువీడ్కొలుపుటయు, నాదిగాఁగల చరితంబు సభ్యులెఱింగినదే! ఈ నగరమున కరుదెంచిన తరువాత నేను రోగిని వేషమునువిడచి, తత్పుర సమీపారణ్య భూముల సంచరించు జీవయాత్ర నడపుచుంటిని. ఒకనాఁడు విజయసేన సుసేనులు ప్రమద్వరతో నయ్యరణ్యమున కరుదెంచిరి. విజయుఁడు ప్రమద్వరను ప్రేమభావమునఁ జూచువాఁడనుసంగతి నేనాదినమున గ్రహించి, కరంబానందించితిని. పరమాత్ముఁడు వారియెడ ననుకూలుఁడు గావుతమని ప్రార్థించుచుందును. పురీంద్రసేనుఁడు తనకూతును హేమునకొసంగి

పెండ్లిసేయనున్నాడని వినినప్పుడు నేనెంతవిచారించితినో, నాహృది
యమున కెఱుక. హేమపాలుఁడును కుటిలవర్తనుఁడగుట, విజయు
నిపై నేరములుగల్పించి, నిందలుమోపి, కఠిననిర్బంధవాసముననిలిపి,
కరంబు బాధించెను.

"ఒకనాఁడు గగనతలమెల్ల మేఘావృతమై జగమంతయును నంధ
కారబంధురము గావించెను. శంపాపరంపరలు తళతళ మెఱయుచు బయలు
పడి యాకసము నగ్నిమయము గావించుచుండెను. నిర్ఘాతసందోహం
బులు ఘుమఘుమారావముల వెలువడుచుండెను; కుంభవృష్టిగా
వర్షము గురియుచుండెను. అత్తఱిగమనము సాగించి, పులిందుని సౌధ
మునకుఁ బోయితిని. కళింగుఁడు నన్నుచితాసనముల ననునయించి,
భోజనమిడి సత్కరించెను. ఆనాఁడు పులిందకళింగులు ప్రమద్వర హర
ణార్థముఁ బోవ సన్నద్ధులగుచుండిరి. ఈవిషయము వారిసంభాషణముల
వలన నెఱింగితిని. తరువాత వంటయింటి సమీపమునకఱిగితిని.
సరసపాక నిధానులచటి పందినొండు గోయుచుండిరి; ఆపందికంఠ
ప్రదేశమున ఖడ్గఖండ మొకటి వారికిఁ గానఁబడియెను. దానినావల
బారవైచిరి. (సంచిలోనుండి ఖడ్గఖండమునుదీసి న్యాయాధికారి
యెదుటఁ బెట్టును) [లేఖకోద్యోగి వ్రాయును]

న్యా — సభ్యులారా! వనపాలుఁడు పురీంద్రసేనునకొసంగిన ఖడ్గఖండము
దీనికిసరిపోయినది! (అని రెండును కలిపిచూపును) —
(సునందతో) తరువాత? తరువాత?

సునంద — తరువాత పులిందకళింగులు ప్రమద్వరను దేరఁ బయనమైరి.
నేనువారి సౌధమంతయును వెదకి, యొకబాటగుండఁ బోవంబోవ
భూగృహమొకటి దృగ్గోచరమయ్యెను. దాని నిర్మాణకౌశలమున
కచ్చెరువడుచు, గమనము సాగించితిని. సుజయుఁడనువాఁడు తాళము
చెవులగుత్తిని చేఁబట్టి కునికిపాట్లు పడుచుండెను. వేఱొండు గది

నుండి యార్తనాద మొకటి నా చెవులఁ బడియెను. జ్యోతిష్యము జెప్పుట యందు నాకుమిక్కిలి పరిచయముగలదని చెప్పి సుజయుని నమ్మించితిని. తాళము జెవులను వానినుండి గ్రహించితిని. సన్ననిమార్గమునుసరించి వానితోఁ గారాగృహముదరి కఱిగితిని. పరికించి, పూరిసెయ్య నొకయువకుఁడు దుఃఖించుచుండెను; దైవమును బ్రార్థించుచుండెను. అతఁడే సుసేనుఁడు. సుజయుఁడాతని కొకరొట్టె నొసంగెను. సమీపమునఁగల బావికి జలహారార్థమఱిగెను. వాఁడు నీరు దోఁడుచుండ మెల్లనఁబోయి వానిని నూతిలోఁ ద్రోసితిని. వాఁడు భయంకర నినాదమొనరించి యందుఁబడియెను; తాళముఁ దెఱచి సుసేనుని యీవలకుఁ బిలిచితిని. ( పు. సే. హర్షము సూచించును ) కాని, సుజయుఁడు తన పరివారముతో మఱియొకబాటనుండి ప్రవేశించి, సుసేనుని కారయందిడి, నన్నొక గృహమున బంధించెను! ఆమఱు వాఁడు పుళిందకళింగు లటకరుదెంచి, "ఓసీ! దుర్మతీ! నీకంత్యకాలము సమీపించినది! నిన్ను కాళికి బలివేసెదను. సిద్ధముగా నుండుమని" చెప్పెను. తరువాత సుసేనును ద్వేషించి, "ఓరీ! అధమా! నీవీ లోకము వాఁడవు కావు! మృత్యుముఖమును బొంద సిద్ధపడుము!" అని కఠినముగాఁ బల్కెను. చేయునదిలేక విచారముతో నెదురుచూచుచుంటిమి. తదనంతర విషయములు గానవిశారదుఁ డీసుమంతుఁ డెఱుంగును. ( లేఖకోవ్యాసి వ్రాయును )

న్యా — సుమంతా! నీవు సత్యనిరతుఁడవు. నీవుఁ దెలియు విషయము లెఱింగించి మా కానందమును గూర్పుము.

సుమం — న్యాయాధిపా! సుమిత్రుఁడు జాలిగుండెవాఁడు. విజయసేనుని యందాతని కడలేని మైత్రి. ఆతనికిఁ గలిగిన దుర్గతికి కరంబుఖిన్నుఁడై యాతనినుద్ధరింప మార్గమరయుచుండెను. ఒకనాఁడు వజ్రపాణి యాతనిం బిలిచి, "సుమిత్రా! హేమపాలునిఁ బిలువు" మని చెప్పెను.

హేమపాలుఁడు వచ్చువంతలో, వజ్రపాణికిఁ దెలియకుండ, సుమి
త్రుఁడాతని మంచముక్రింద దాగుకొనియె. హేమపాలుఁడు వచ్చిన
తరువాత వజ్రపాణి యాతనితోఁ గొంతవడి సంభాషించెను. ఆసం
భాషణాంశమిది: పులిందుని సేవకుఁడు దుర్జయుఁడు వజ్రపాణిని
రాజమార్గమునఁ గలిసికొనియెను; తనయేలిక సౌధమునకు రమ్మని
యెను. భూగృహమున సుసేనునిఁజూపి వజ్రపాణితో నిట్లనియెను.
"వజ్రీ! సుసేనుఁడు లోకమునమ్మినటుల మరణించలేదు. నీవాతనిని
ప్రత్యక్షముగాఁ జూచుచున్నావుకదా? హేమపాలుఁడు విజయ
సేనుని మరణముఁ గోరుచేని సుసేనుఁడు జీవములతో నుండరాదు.
ప్రమద్వరను పులిందునకొసంగిన సుసేను నాఁతడ సంహరించును. ఇది
మాయేలిక యభిమతము. హేమపాలునకీవార్త నెఱిఁగించి వలయు
విధమున వర్తింపుమనుము." అనవుడు వజ్రపాణి యటులనే యొన
రింతునని వాగ్దానముజేసి హేమపాలునకీవార్త నంతయు నివేదించెను.
ప్రమద్వర వన్యులకొసంగుట హేమపాలుని యభిమతముగాదు; అప్పటి
కంగీకరించి, తరువాత కర్తవ్యమూహింప వచ్చునని లేఖ నొండు
వ్రాసి దుర్జయునిచేఁ బులిందునకు దానినందఁజేసెను. (హే.పా. పులిం
దునకు వ్రాసిన యుత్తరమును న్యాయాధికారి కందఁజేయును) (లేఖ
కొద్యోగి వ్రాయును)

న్యా—(లేఖచదివి, యాశ్చర్యభరితుఁడై) మీరందఱాలింపుఁడు. (ప్రకా
శముగాం జదువును) హేమా! ఇది నీకృతమేనా?

హే.పా—(భయవిషాదములతో) అవును! అది నేవ్రాసినదే!

న్యా—సభ్యులారా! ఈలేఖవలన హేముని కపటవర్తనము బయలుపడి
నది! సుమంతా! ఈలేఖ నీకెట్లులభించెను?

సుమం—సుమిత్రుఁడు మంచముక్రిందఁదాగి వారిరువురిసంభాషణ మా
ద్యంతమాలించి నాకుఁదెలియఁజెప్పెను. ఆనాఁడే మేమిద్దరము ను

గాయకుల వేషములు దాల్చి పుళింగుని సౌధమున కరిగితిమి. దుర్జయుండు తెచ్చినజాబుఁ దిలకించి పుళింపకళింగులు పరమానందభరితులై మారాక కనుమతించిరి. సంగీతశాస్త్రమున నాకుఁగల పరిచయలేశమును నాశక్తికొలఁది ప్రదర్శించితిని. సుమిత్రుఁడు కూడ నాకుఁదోడయ్యెను. ఆగానమాధుర్యమును గ్రోలి గ్రోలి, పుష్పాసవసేచనమున బుద్ధి మందీభవించిన దశకు మైమఱచి, పట్టు దిండ్లమర్పఁబడిన యాసనములమీద నే వాలి నిదురపోయిరి. సుమిత్రుఁడు బల్లపైఁగల యుత్తరమును సంగ్రహించెను. పాటపాడుచు మేము నిష్క్రమించితిమి. భూగృహమునకుఁ బోయి సుసేనసునందులఁ జూచితిమి. ఆఁకస్రాయితోఁ గారాగారముతలుపులఁ గల యినుపకడ్డీలను గోసితిమి. సుషేణసునందు లీవలఁబడిరి. మాకెవ్వరు నడ్డుపడలేదు. తరువాత సత్వర గమనమునఁ బ్రబలమైన యరణ్యమున కరుదెంచి రహస్యస్థలమున రాత్రియంతయుఁ దాగియుంటిమి. తెల్లవారుజామున కోలాహల మొండుదూరమున మాకు వినవచ్చెను. వాయువేగమున నిటువచ్చితిమి. పరమేశ్వరుఁడు మాకు సాయమయ్యెను. అంధకారము భాసిపోయెను. సుప్రభాత మానంద దాయకముగాఁ బొడసూపినది! (లేఖ కోద్యోగి వ్రాయును)

న్యా—సుమిత్రా! నీవు సుగుణధనుఁడవు, మిత్రధర్మమెఱిఁగినవాఁడవు, నిన్ను దేవుఁడు కాపాడుగాక!

సుమి—(వ.పా సమీపించి, చూచి, న్యాయాధికారితో) దేవా! వజ్రపాణి మరి జీవింపడు.—అయ్యో! వీఁడు మరణించినాఁడు. వీనికి సంస్కారము గావించి వచ్చెదను. (శవముతో నిష్క్రమించును)

న్యా—సభ్యులారా! వజ్రపాణి పాపాత్ముఁడగుట భారము సైపలేక పరలోకమునకుఁ బోయెను. హేమపాలుఁడు పవిత్రవంశమున జన్మించినను, పరమపాతకము నాచరించి, తనజీవితము నే గాక, తన

వంశమునుగూడ కళంకభూయిష్ఠ మొనరించెను. వీఁడు భ్రాతృ
హంతకుఁడు! కష్టజీవి! వీని నురిదీసినఁ గార్యమేమియు నుండఁబోదు.
కఠినకారాగృహ శిక్ష వీనికి విధించితిని; వీఁడు బ్రతికినన్నాళ్లు కారా
గృహమున నుండవలసినదే! పుళిందకళింగుల దురంతములు మితిమీరి
నవి. వారలకు నిర్బంధశిక్ష విధించితిని!—విజయసేనునకుఁ బట్టాభి
షేక మొనరింపవలయును. పురంద్రసేనా! అందుకువలయు ప్రయ
త్నములను నీవు సేయుము.

[ భటులు హే. పా. ని, శృంఖలములఁ బంధించి నడపింతురు—వి. సే.—
సుసేన,—పు. సే.—సునందలు తప్ప తక్కినవారందఱు నిష్క్ర
మింతురు ]

పు. సే.—(వి. సేనునితో) కుమారా!

చ. తెలియక బాధపెట్టితిని; తీవ్రతరంబగు భాషణంబులన్
బలికి మనోగతంబు వలవంతలఁ బాలొనరించినాను; నీ
కులమును శీలముం దెలియఁగగోరి ప్రయత్నము సేయనైతి; ని
ర్మలహృదయా! క్షమించి, యపరాధముల న్వెలి చేసి సైపుమా!

వి. సే.—జనకా! నన్ను మీరింతగా వేఁడెదరేమి చిత్రము! నా కారణమునఁ
గదా? మీరెల్లరు కన్నీరు గార్చితిరి? ప్రమద్వరను సుసేనుని కుశల
వార్త నెఱింగించితిరా?

సునంద—పురంధ్రీ! నా పలుకాలింపుము.

తే. గీ. ఏసతీలలామ కొఱకు నెల్లకష్ట
ములకు నోర్చి నీలాపనిందలకు శిరము
వంచె విజయసేనుఁడు శాంతభరితుఁడగుచు
నామె నాతని కొసఁగుమయ్యా! పురంద్ర!

# సప్తమాంకము

(ప్రమద్వర — రోహిణి ప్రవేశింతురు)

ప్ర — (కన్నీరుఁగార్చుచు)

౧. సీ. ఓక్రూరపాపరతంత్ర! యోగంభీర జలధీ!

యమలగుణాకరా! యాలకింపు

హేమపాలుఁడు వడినేగుదెంచి సుసేనుఁ

డడవిలో నీహేతి నణఁగెనంచు

వచియించి, న్యాయాధిపతులరుదెంతురు;

విజయసేనుఁడు భూమివిడచు నతివ!

యభిమానముండిన నరుగుమెందేనియు

నిలువఁగరాదొక నిమిషమేని

ఆ. వె. యని లిఖింపు జాబు జని నేను విజయాంకు

న కొసఁగి యెటకేని నడచునటులఁ

జేయుదనఁగ వ్రాలు జేసి యంపితి లేఖ

పాపమెఱుఁగనీదు పాదమాన

(అని పాదములపై వ్రాలును)

సునంద — విజయసేనా! ప్రమద్వర నిర్దోషి. నీవు దోషివని యామెకల నైనఁ దలంపలేదు. హేమపాలుని వాక్యములవలన నీవు దారుణావస్థ నున్నటులఁ దలంచి, భయపడి, నిన్ను రక్షింప తెలియంగలుగక, హేముని యభిమతానుగతముగ లేఖవ్రాసి నీకంపినది. ఇది భావ్యము. నీవాలేఖనుగూర్చి విచారింప నవసరము లేదు.—

వి. సే — అమ్మా! చెప్పవలయునటే! ప్రమద్వర నిజముగా ప్రమద్వర!

సునంద — పురీంద్రసేనా! నాకుమారుని విజయుని నిండార ప్రేమ భావమునఁ బెంచితివి. నీయుపకారము నేమఱువఁజాలను!

డో. వా—(ప్రవేశించి) దేవా! పురేంద్రమహాశయా! ముల్తాననగరము నుండియమాత్య శేఖరుం డొకఁ డరుదెంచి ద్వారము జెంత వేచియున్నాఁడు.

(పు. సేనుఁ డేఁగి, యమాత్యునితోఁ బ్రవేశించును)

పు. సే—కేసరీ! సురపాలక్ష్మాపాలునకు క్షేమమే? నీవుఁ గుశలంబా?

కే—దేవా! అందఱును క్షేమమున్నవారు, మీరీలేఖం దిలకింపుఁడు.

(ఉత్తరమిచ్చును)

పు. సే—(అందుకొని, యాత్మగతమునఁ జదివికొని, వి. సేనునకిచ్చును. వి. సే. గట్టిగాఁ జదువును)

"శ్రీ పురేంద్రసేన మహాశయునకు. ముల్తాననగరాధ్యక్షుఁడగు సురపాలుఁడు వ్రాయు విన్నపములు:

మోసకారులగు కొందఱు మంత్రుల పలుకులాలించి, నిన్నుఁ బరభూములకుఁ దోలినాఁడను. నాయపరాధము మన్నించి, ముల్తాననగరమున కరుదెమ్ము. నీవియోగమువలనఁ గరంబు కృశించితిని.

సురపాలుఁడు."

సునంద—ఆహా! ఆనందమానందము! పురేంద్రా! అన్నియుం శుభప్రదముగా ముగిసినవి! నీకోర్కెలు ఫలించినవి. ఇంకేమి కావలయును?

పు. సే—తల్లీ! సుగుణహారి విజయసేనుఁ డల్లుడయ్యె; పున్నముల పంట కుమారుఁడు లభించె; పుణ్యవతివగు నీచెలికారము గలిగెను; సురపాలునకు మరల నాయందు తొల్లిఁటి యభిమానము పొడసూపె. నాకొం డొక యభిలాష యేదికలదు? అయిన నిట్లగుఁగాక!

తే. గీ. విమలమగు ప్రేమ చెదరక వెలయురీతి;
మనచరిత్రంబు పుట్టని జనులచేత
జనన మొందఁగనున్న బాషలనభినయ
ముఁగనుగాత! సాపదులు ప్రమోదమొంద.

అందఱు:—తథాస్తు!

సమాప్తము

# రాజవైద్యశాల

## రాజమహేంద్రవరము.



దేశమునందెన్నియో వైద్యశాలలు బయలుదేరినవి. ఎంతమందో దంభపత్రికటనలు చేసి ప్రజలవద్ద డబ్బు లాగుచున్నారు. మా వైద్యశాల అట్టిదికాదు. ఇందన్ని రోగములకు తగు ఔషధములు సిద్ధముగ నుండును. ప్రతిఔషధము కారు చౌకగా నుండగలదు. మేము చెప్పినప్రకారము పథ్యపానములు చేసినను మామందులు గుణమీయనియెడల పోస్టు ఖర్చులతో కూడ మామందుల ఖరీదు యిచ్చివేయబడును. అనేక వేల యోగ్యతాపత్రములు గలవు. ఒక్కమారు పరీక్షించండి.

# స్టూడెంట్సు కల్యాప

విద్యార్థులకిది కల్పవృక్షమువంటిది. అతివేడివలన శుక్ల నష్టము (స్పెర్మటోరియా) తలనొప్పి, పార్శ్వపునొప్పిమున్నగు వ్యాధులతో బాధపడు విద్యార్థులు దీనిని సేవించిన వారము రోజులలో మంచి ఆరోగ్యవంతులగుచున్నారు. ఒక ఆయుర్వేదవిద్యాప్రవీణుడగు సిద్ధుని సలహాప్రకారము తయారుచేయ బడిన క్రొత్తమందు.

15 రోజులకు సరిపోవు లేహ్యము రూ 2—0—0

డిటో పొట్లములు 1—0—0

ఒకపూట లేహ్యము ఒకపూట పొట్లము చొ॥ వేసికొనుచున్నెడల 15 దినములలో వజ్రదేహమగును. పరీక్షించి మేలుపొంద గోరుచున్నారము.

# ప్రకటన



ఇండియా అంతకు ఏజంట్లు కావలయును.

ఆంధ్రోద్యమమునకు తోడ్పడర్గా?

మేజోళ్లు మెత్తనవి, పసందైనవి, గట్టివి, పలురంగులోనైన, ఏకోలతకలవైనను, సరే, మావద్ద సరసమైన ధరలకు దొరకును.

| | |
|---|---|
| 9 అంగలవి డ1కి | 4—8—0 |
| 10 అంగలవి డ1కి | డిట్టో |
| 11 అంగలవి డ1కి | డిటో |

వర్తకులకు, విశేషసరకు కొనువారికిన్ధాళమైన కమీషనీయఁబడును. నేడే కార్డు వ్రాయుడు.

ఆంధ్రి నిట్టింగు ఫ్యాక్టరీ,

220 చైనాబజారు రోడ్, మదాసు.

---

బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వ్రాయఁబడిన ఈక్రిందిగ్రంథములు. పైమరీ స్కూళ్లలో చెప్పుటకు, వినోదముగా చదువుకొనుటకును వీలుగానున్నవి.

| | |
|---|---|
| విజయనగరరాజులకథలు. | ౦—౩—౦ |
| చిత్తూరురాజులకథలు. | ౦—౪—౦ |
| ఢిల్లీచక్రవర్తులకథలు. | ౦—౨—౦ |
| గోల్కొండనవాబులుకథలు. | ౦—౨—౦ |

వలయువారు;— హరి అండ్ కో

రాయవరము, రామచంద్రపురము పోష్టు, గోదావరిజిల్లా.

# ఆంధ్ర సారస్వత నికేతనము.

## రాజమహేంద్రవరము

మనోహరములు, నీతిబోధకములు, జాతీయప్రబోధక
, నగు గ్రంథములు ప్రకటింపబడుచున్నవి. చందాదారు
తిని యీ కాగితము కరవురోజులలో కూడ చౌకగా ఇవ్వగ
లవు. చాలమంది గ్రంథముద్రణము మానినను, సంవ
రమునకొక గ్రంథము వేయుచు కాలక్షేపము చేయుచున్న
ఇతరగ్రంథమాలల వారివలె గాక సకాలములో రెండు నెల
కొక రూపాయి విలువగల గ్రంథములు మేలైన ఇంగ్లీషు కాగి
తముమీద ముద్రించుచున్నాము.

[1] నూరుపుటలకు నాలుగణాలువంతున చందాదారులకు
గ్రంథములు చౌకగా నీయబడుచున్నవి.

[2] నాలుగణాలు ప్రవేశరుసుము క్రిందనిచ్చి లేదా మొ
దటి వి.పితో రాబట్టుకొనుమని వ్రాసి ప్రతిగ్రంథము వి.పి త్రిప్పివే
యకుండ పుచ్చుకొనువారు చందాదారులుగా యెన్నబడుదురు.

[3] రెండుమారులు వి.పి త్రిప్పివేయు చందాదారులు అర్థ
రూపాయి చెల్లించి తిరుగా చందాదారులు కావలసియుందురు.

[4] మా పుస్తకములలో "దేశోద్ధారకులు" యీసంవ
త్సరము స్కూలుఫయినలు కెక్కినకావున ఇంతటినుండి చందా
దారులై మా పుస్తకములు తెప్పించుకొనువారికి స్కూలుపుస్త
కములుగా పెట్టబడుచుండు మా పుస్తకములన్నియు చౌకగా
దొరకగలవు. ఇవే ఇతరులకు అప్పటి కాగితముధరనుబట్టి
[illegible] కాగలవు.